



# బ్రహ్మ

# రావణ బ్రహ్మ

# భగవాన్ రావణ బ్రహ్మ


రచయిత: **త్రిమత ఏకైక గురువు**

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-44 ద్వితీయ ముద్రణ : సెప్టెంబర్-2022

ప్రతులు : 1000 **వెల : 90 /-**





## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రైమత ఆధ్యాత్మిక రచనలు



**"ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు**

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దెయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు

"ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు



26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మపత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర.
41) భావము-భాష.
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము.
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము.
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు.
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.
76) నాది లోచన-నీది ఆలోచన.

**"ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు**

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక ప్రసంగములు

(DVD'S)



01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక ప్రసంగములు



(DVD'S)

27. ఆత్మ, 28. తాత,
29. తల్లి, 30. భయం.
31. ఆత్మపని, 32. బట్టతల.
33. యాదవ్, 34. జ్ఞానశక్తి.
35. సమాధి, 36. 6-3=6.
37. సంతకము, 38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము, 40. తోలేవాడు.
41. తల్లి తండ్రి, 42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ, 44. గురు చిహ్నాం.
45. ఆస్తి-దోస్తి, 46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము, 48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు, 50. పురుషోత్తమ.
51. మతద్వేషము, 52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ, 54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు, 56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి, 58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు, 60. దశ-దిశలు.
61. మాట-మందు, 52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము, 64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి, 66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం, 68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.

109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు
మత సాంప్రదాయములు.
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు, 130. కాలచక్రం.
131. బ్రహ్మవిద్య. 132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. పురుషోత్తమ-శ్రీరామ.
136. జలం. 137. అధిపతి.
138. గ్రహాంతర వాసులు.
139. దేవునికి ఒక్కడే కుమారుడు-
దేవునికి అనేకమంది కుమారులు.
140. దేవుడు ద్వితీయుడా?
అద్వితీయుడా?
141. మనిషి చేతిలో భగవంతుడు-
దేవుని చేతిలో మనిషి.
142. శరీరములో రక్తము-
గ్రంథములో జ్ఞానము.
143. గ్రంథములో జ్ఞానము-
మనిషిలో రక్తము.
144. త్రైత సిద్ధాంత చరిత్ర.
145. కుశాల్ కుశాల్ లంజమ్మ
నా నెత్తిమీద రెండు తన్నమ్మ.
146. రాజాధి రాజా - దేవాధి దేవా.
147. ఎనిమిది మంది భార్యలున్న
శ్రీకృష్ణునికి గోపికల మీద ధ్యాస ఎందుకు?
148. కులం-మతం, 149. గుడి.
150. గురుపౌర్ణమి సందర్భముగా మీటింగ్
151. భగవంతుడు ఎవరు?
152. విశ్వదాభిరామ వినుర వేమా.
153. కాలం, 154. యమధర్మ.
155. కుడి ధర్మం-ఎడమ ధర్మం
156. ఇందుత్వము అందరిలో కలదు-
హిందుత్వము కొందరిలో కలదు.
157. ధర్మములు మూడే ఉన్నవి
అధర్మములు ఆరు అయినవి?
158. నేను-నా తండ్రి-నా తాత,
నేను-నా అమ్మ-నా అవ్వ.
159. ఆద్య ఆత్మీకము-ఆధ్యాత్మికము,
ఆద్య దేవీకము-ఆద్యేవీకము.
160. విత్తనము లేని చెట్టు
శివుడా! ఈశ్వరుడా!!
161. మనిషిని జంతువు అంటే
అవమానించినట్లు కాదా!
162. దేవుడు కరుణామయుడు-
దేవుడు కఠినాత్ముడు.
163. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 94913 62448, 98665 12667, 94405 56968.

**గుత్తి, అనంతపురం (జిల్లా),** A.P.
Cell : 9885538064, 7013827287.

**అనంతపురం టౌన్, (జిల్లా),** A.P.
Cell : 9440497234, 9492328830.

**ధర్మవరం, అనంతపురం (జిల్లా)**
Cell : 9440556968, 8074888532.

**కొత్త చెరువు, అనంతపురం (జిల్లా)**
Cell : 9493622669, 9573697946.

**ముదిగుబ్బ, అనంతపురం (జిల్లా)**
Cell : 9959494379, 8985343840.

**కళ్యాణదుర్గం, అనంతపురం (జిల్లా)**
Cell : 8074710579, 7288093256.

**తాడిపత్రి, అనంతపురం (జిల్లా)**
Cell : 9160377268, 9959989757.

**హిందూపురం, అనంతపురం (జి)**
Cell : 7013530009, 9440980036.

**గుంతకల్, అనంతపురం (జిల్లా)**
Cell : 7892204207, 9701636617.

**మడకశిర, అనంతపురం (జిల్లా)**
Cell : 9502928728, 9538777485.

**జలదుర్గం, కర్నూల్ (జిల్లా)**
Cell : 9440412497, 9490404320.

**డోన్, కర్నూల్ (జిల్లా),** A.P.
Cell : 9441580309, 9966363732.

**కర్నూలు టౌన్, (జిల్లా)** A.P.
Cell : 9440244598, 8686818183.

**నందికొట్కూరు, కర్నూల్ (జిల్లా),** A.P.
Cell : 9963738947, 9440047256.

**నంద్యాల, కర్నూల్ (జిల్లా),** A.P.
Cell : 9885385215, 7288963214.

**కోవెలకుంట్ల, కర్నూల్ (జిల్లా),** A.P.
Cell : 9398894821, 9491177963.

**కడప టౌన్, కడప (జిల్లా),** A.P.
Cell : 9948911270, 9908095131.

**పులివెందుల, కడప (జిల్లా),** A.P.
Cell : 9293199539, 9966512141.

**జమ్మలమడుగు, కడప (జిల్లా)**
Cell : 9951836980, 9494509300.

**ప్రొద్దుటూరు, కడప (జిల్లా)**
Cell : 8886123856, 9533378708.

**కుప్పం, చిత్తూరు (జిల్లా),** A.P.
Cell : 9652755110, 9347089639.

**మదనపల్లి, చిత్తూరు (జిల్లా),** A.P.
Cell : 8519938999, 9030700963.

**బంగారుపాళ్యం, చిత్తూరు (జిల్లా)**
Cell : 9985483241, 6300087489.

**వి.కోట, చిత్తూరు (జిల్లా),** A.P.
Cell : 9440305700, 7702790537.

**శ్రీకాళహస్తి, చిత్తూరు (జిల్లా),** A.P.
Cell : 9704770317, 9494368185.

**తిరుపతి, చిత్తూరు (జిల్లా),** A.P.
Cell : 9963051963, 6305794700.

**పీలేరు, చిత్తూరు (జిల్లా),** A.P.
Cell : 9515193300, 9441948832.

**ఒంగోలు టౌన్, (జిల్లా),** A.P.
Cell : 9247342444, 9182020517.

**కంభం, ఒంగోలు (జిల్లా),** A.P.
Cell : 9849883261, 6281267563.

**గిద్దలూరు, ఒంగోలు (జిల్లా),** A.P.
Cell : 7702743624, 9866802373.

**దర్శి, ఒంగోలు (జిల్లా),** A.P.
Cell : 8142182858, 8247045622

**పొదిలి, ఒంగోలు (జిల్లా),** A.P.
Cell : 8019639963, 8143666963.

**నెల్లూరు టౌన్, (జిల్లా),** A.P.
Cell : 7989975473, 9949738302.

**గూడూరు, నెల్లూరు (జిల్లా),** A.P.
Cell : 9494631664, 9490809181.

**గుంటూరు టౌన్ (జిల్లా),** A.P.
Cell : 9948014366, 7013273913.

**నరసరావుపేట, గుంటూరు (జిల్లా)**
Cell : 9989204097, 7989427908.

**చిలుకలూరిపేట, గుంటూరు (జిల్లా)**
Cell : 9381764900, 9949444790.

**పిడుగురాళ్ల, గుంటూరు (జిల్లా)**
Cell : 9908422109, 8341327232.

**నూజివీడు, కృష్ణా (జిల్లా),** A.P.
Cell : 6300233929, 9963049163.

**విజయవాడ, కృష్ణా (జిల్లా),** A.P.
Cell : 8886502853, 8106961167.

**కాకినాడ, తూ.గోదావరి (జిల్లా)**
Cell : 7396038888, 9177702721.

**రాజమండ్రి, తూ.గోదావరి (జిల్లా)**
Cell : 9848064692, 9603444963.

**భీమవరం, ప.గోదావరి (జిల్లా)**
Cell : 9948275984, 8686963963.

**తాడేపల్లి గూడెం, ప.గోదావరి (జి)**
Cell : 9603202479, 9491018180.

**విశాఖపట్నం టౌన్, (జిల్లా) ,** A.P.
Cell : 8977713666, 7674979663.

**అనకాపల్లి, విశాఖపట్నం (జిల్లా)**
Cell : 8978842826, 7288958963.

**మజ్జివలస, విశాఖపట్నం (జిల్లా)**
Cell : 8309578716, 9704932649.

**శ్రీకాకుళం, శ్రీకాకుళం (జిల్లా)**
Cell : 9959779187, 9550976341.

**బొడ్డాం, శ్రీకాకుళం (జిల్లా),** A.P.
Cell : 9494248963, 8919627242.

**విజయనగరం, విజయనగరం (జి)**
Cell : 9703534224, 9030089206.

**బొబ్బిలి, విజయనగరం (జిల్లా),** A.P.
Cell : 9494853773, 9441852256.

**వనపర్తి టౌన్, (జిల్లా),** T.S.
Cell : 9440361908, 9581681329.

**కొత్తకోట, వనపర్తి (జిల్లా),** T.S.
Cell : 9704651223, 8790558815.

**పెబ్బేరు, వనపర్తి (జిల్లా),** T.S.
Cell : 9912796971, 9440851995.

**గద్వాల్ టౌన్, (జిల్లా),** T.S.
Cell : 9908755314, 6362031011.

**ఎర్రవల్లి, గద్వాల్ (జిల్లా),** T.S.
Cell : 8499875463, 9581748864.

**మహబూబ్‌నగర్ టౌన్, (జిల్లా),** T.S.
Cell : 7893144040, 8008903383.

**నాగర్‌కర్నూల్ టౌన్, (జిల్లా),** T.S.
Cell : 9441565751, 7013935372.
**మఖ్తల్, నారాయణపేట (జిల్లా),** T.S.
Cell : 9951572847, 8247857221.
**జగిత్యాల టౌన్, (జిల్లా),** T.S.
Cell : 7702900460, 9030359585.
**వరంగల్ టౌన్, (జిల్లా),** T.S.
Cell : 9963930067, 9666090401.
**తొర్రూరు, మహబూబాబాద్ (జిల్లా)**
Cell : 9849378709, 9542769165.
**భువనగిరి టౌన్, (జిల్లా),** T.S.
Cell : 9948060838, 8464824182.
**జనగామ టౌన్, (జిల్లా),** T.S.
Cell : 9573552963, 9440556611.
**సూర్యపేట టౌన్, (జిల్లా),** T.S.
Cell : 9010923707, 6301329308.
**కోదాడ, సూర్యపేట (జిల్లా),** T.S.
Cell : 9848574803, 9515426949.
**నల్గొండ టౌన్, (జిల్లా)** T.S.
Cell : 9866423853, 9676020963.
**హుజురాబాద్, కరీంనగర్ (జిల్లా)**
Cell : 9542061601, 9989202003.
**హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం.**
Cell : 9032963963, 9848590172,
9491040963, 7780210207.
**చెన్నై, తమిళనాడు రాష్ట్రం.**
Cell : 9445554354.
**రాయఘడ్, ఒడిషా రాష్ట్రం.**
Cell : 8260963963, 6370043490.

**ఖుర్దా, ఒడిషా రాష్ట్రం.**
Cell : 6371487960, 7873229092.
**రాయచూర్, కర్ణాటక రాష్ట్రం.**
Cell : 8310164375, 9632418716.
**బెంగుళూర్, కర్ణాటక రాష్ట్రం.**
Cell : 7411459912, 8095009014.
**హోస్పేట, కర్ణాటక రాష్ట్రం.**
Cell : 9611133635, 8050309963.
**కోలార్, కర్ణాటక రాష్ట్రం.**
Cell : 8147158272, 9741827901.
**ములబాగిల్, కర్ణాటక రాష్ట్రం.**
Cell : 6362699798, 8095009014.
**ద్రావిడ శ్రేష్ఠి సంఘం**
Cell : 9949217991, 9948947630.
**సువార్త క్రైస్తవ సంఘం**
Cell : 9346963963, 7386353963.
**ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ**
Cell : 9445554354, 9515218963.
**రావణబ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం**
Cell : 8978337025, 9133353709.

**LAVANYA KANUMURI**
Cleveland, Ohio, U.S.A,
+1(440) 427 1158.

**S. RAGHU RAMI REDDY**
Seattle, WA, U.S.A,
+1 (425) 698 0375.

**SOMASEKHAR.GALLI**
JAPAN, Ph:+81-80-3535-4445,
+81-80-6060-4445.

**RAJEEV GANAGULA**
FRANCE, Ph:+33634016350.

**www.thraithashakam.org**
**Youtube : thraitha siddantham**

# బ్రహ్మ-రావణ బ్రహ్మ-భగవాన్ రావణ బ్రహ్మ

రావణబ్రహ్మయను పేరు అందరూ వినియుందురు. ఆ పేరును రెండు భాగములుగా విభజించవచ్చును. ఒకటి రావణ, రెండు బ్రహ్మ. 'రావణ' అను పదమును గురించి తర్వాత చెప్పుకొందుముగానీ మొదట 'బ్రహ్మ' అను పదమును గురించి చెప్పుకొందాము. బ్రహ్మయనగా పెద్దయని అర్థము. సర్వలోకములకు పెద్ద ఒక్కడే గలడు. ఆ ఒక్కడే దేవుడు యని చెప్పవచ్చును. దేవుడు అనగా! 'వెతకబడేవాడు' యని అర్థము. దానినే **'దేవులాడబడేవాడు దేవుడుయని'** అంటారు. దేవుడు వెతకబడేవాడు అయితే అతను ఎవరికీ తెలియకుండా ఎక్కడో ఒకచోట ఉండాలి కదా! అని ఎవరయినా అడుగవచ్చును. దానికి జవాబుగా దేవుడు ఎక్కడో ఒకచోట ఉన్నాడు అని ఒప్పుకొనినా, ఆ ఉన్నవాడు ఎవడు? అన్న ప్రశ్న వెంటనే పుట్టుకొచ్చుచున్నది. దానిని ప్రత్యక్షముగా అడిగితే **"దేవుడు ఎవరు?"** అని ప్రశ్నించవచ్చును. ప్రశ్న ఉన్న తర్వాత జవాబు తప్పనిసరిగా ఉండును. అయితే ఆ జవాబు అందరికీ తెలియవచ్చును లేక తెలియక పోవచ్చును. ప్రశ్న, ప్రశ్నకు జవాబు రెండు యున్నప్పటికీ ప్రపంచములో అతి పెద్ద ప్రశ్నగా మిగిలిపోయినది "దేవుడు ఎవరు?" అనునది. ఆ ప్రశ్నకు జవాబు ఉన్నప్పటికీ ఎవరికీ తెలియని అతి రహస్య జవాబు 'దేవుడు ఫలానావాడు' అన్నది. ఒక విధముగా చెప్పితే జవాబులేని ప్రశ్నయని చెప్పవచ్చును. ప్రశ్న ఉన్న తర్వాత జవాబు ఉండును కావున ఎవరికీ తెలియని జవాబుగల ప్రశ్నయని కూడా చెప్పవచ్చును. ప్రశ్న ఒకరిదయితే జవాబు ఇంకొకరు చెప్పవలసి యుండును. అయితే ఈ ప్రశ్నకు జవాబున్నా ఆ జవాబు దేవునికే తెలుసు. అయితే ప్రశ్న ఎవరిదయినా కావచ్చును, జవాబు మాత్రము దేవునిదేయని చెప్పవచ్చును. దేవుడు తన జవాబును ప్రత్యక్షముగా చెప్పడు. పరోక్షముగా చెప్పియున్నాడు. అయితే ఆ జవాబును ప్రజలు గ్రహించలేకపోయారు. కావున ఆ జవాబు ఎవరికీ తెలియని అతి పెద్ద రహస్య జవాబయినది.

"దేవుడు ఎవరు?" అను ప్రశ్నకు దేవుడు ఫలానావాడు అను జవాబేదో, అది రహస్యమైనదియగుట వలన దేవుడు కూడా రహస్యమైనవాడే యని చెప్పవచ్చును. దేవుడు రహస్యుడా? అని ప్రశ్నించితే లేదు ఆయన బట్టబయలై అందరికీ దగ్గరగా, అందరూ తెలియునట్లు కలడని చెప్పవచ్చును. దేవుడు ఒక్కచోట రహస్యముగా దాగియున్నాడా? అని ప్రశ్నించితే దానికి జవాబుగా దేవుడు ఒక్కచోట రహస్యముగా లేడు, దేవుడు అన్నిచోట్ల యున్నాడు. కావున ఆయనను చూడలేక ఎక్కడోయున్నాడు అనడము, రహస్యముగా యున్నాడు అనడము, ఒక్కచోట యున్నాడు అనడము మనుషుల తప్పేగానీ దేవుని తప్పుకాదు. ఎలాగయినా మనుషుల అజ్ఞానము వలన దేవుడు అంతటా యున్నా, ఆయనను తెలియలేక దేవుడు లేనేలేడు అనువారు కలరు. అప్పుడు దేవుని ఉనికికే ప్రమాదమగుట వలన, దేవుడు ఉన్నవాడు కాదు లేనివాడు అని అనుట వలన, దేవుడు తన ఉనికిని తెలుపుటకై, స్వయముగా మనుషులు దేవున్ని తెలియుటకు అవసరమైన జ్ఞానమును తెలియజేయాలని అనుకొన్నాడు.

దేవుడు అనగా తెలియనివాడు, లేనివాడు అను అపవాదు పోవుటకు దేవుడు మనుషులకు తనను తెలియు ఉపాయ జ్ఞానమును తెలుపాలనుకొన్నాడు. అయితే తనకంటూ కొన్ని ధర్మములను పెట్టుకొని. తన ధర్మముల ప్రకారము ఉండాలనుకొనువాడు దేవుడు అయినందున, ఆయన నేరుగా ప్రజలతో మాట్లాడు అవకాశము లేదు. దేవుడు ముఖ్యముగా మూడు ధర్మములను అనుసరిస్తున్నాడు. రూప, నామ, క్రియలు లేనివాడుగా యున్నాడు. ఆ పద్ధతి ప్రకారము దేవునికి పేరు లేదు, రూపము లేదు, పని లేదు. మనిషి దేవున్ని చూచి తెలియుటకు ఆయనకు రూపము లేదు. ఆకారము లేనిదానివలన మనిషి దేవున్ని చూచుటకు అవకాశమే లేదు. అట్లే దేవునికి పేరులేదు అందువలన దేవుడు ఫలానా పేరుగలవాడు

యని చెప్పుటకు వీలులేదు. ముఖ్యముగా గమనించవలసినది ఏమనగా! దేవుడు అను పదము పేరు కాదు. దేవుడు వెతకబడేవాడు అని తెలియు నిమిత్తము చెప్పు పదముగా లెక్కించవలెను. అట్లే పని చేయని వాడు దేవుడు. ఆయన ఏ కార్యముగానీ చేయువాడు కాదు. అందువలన ఫలానా పని చేయువాడు దేవుడు అని చెప్పుటకు వీలులేదు. ఆకారము, పేరు, పని లేనివాడు దేవుడు అయినందున ఆయనను ఎవరూ గుర్తించుటకు అవకాశమే లేదు. ఎవరూ తెలియుటకు అవకాశము లేని దానివలన ఆయన ఎప్పటికయినా వెదకబడే వాడేగానీ, తెలియబడేవాడు కాదు. అందువలన ఆయన శాశ్వితముగా దేవునిగా ఉండిపోయాడు.

**ప్రశ్న :- దేవుడు పని చేయనివాడైతే ప్రపంచమును ఎలా సృష్ఠించాడు? ప్రపంచమును సృష్ఠించిన సృష్ఠికర్తను అని దేవుడే తన మాటలలో చెప్పాడు. దైవగ్రంథములలో దేవుడు సృష్ఠికర్తయని చెప్పబడినాడు. దేవుడు ప్రపంచమును తయారు చేసినవాడగుట చేత దేవుడు పని చేసినవాడగు చున్నాడు. అటువంటప్పుడు దేవుని ముఖ్యమైన ధర్మములలో దేవుడు క్రియారహితుడు అని చెప్పడము అసత్యము కాదా? దేవుడు పని చేయనిదే సృష్ఠి తయారయినదా? దీనికి మీ జవాబు ఏమి?**

**జవాబు :-** దేవుడు 'ఏ పనిని చేయువాడు కాదు' అనుమాట వాస్తవమే. ఆ విషయము మనుషులమైన మనకు అర్థము కావాలంటే ముందుగా కొంత సమాచారమును తెలియవలసి యున్నది. అది ఏమనగా! మొదట ప్రపంచము లేని సమయములో కూడా దేవుడు ఒక్కడే యున్నాడు. దేవుడు తప్ప ఎవరుగానీ, ఏదీగానీ లేని సమయములో ప్రపంచమనునది లేదు, ప్రపంచములో మనుషులుగానీ, జీవరాసులుగానీ లేరు. ఏదీకాని సమయములో, ఏమీ లేని సమయములో దేవుడు ప్రపంచమును సృష్ఠించ దలచుకొన్నాడు. సృష్ఠి పూర్వము దేవుడు పనిని చేసి ప్రపంచమును తయారు

చేశాడు. దేవుడు పని చేయడము వలన ఆనాడు ప్రకృతి తయారయినది. ప్రకృతియనగా ఐదు భాగములుగా యున్న ప్రపంచము. ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ఐదు భాగములుగా ప్రపంచము యున్నది. ప్రపంచము లేని సమయములో దేవునికి ధర్మములు లేవు. దేవుడుయని కూడా పిలువబడేవాడు కాడు. ఎవరూ లేని కాలములో ఆయనను దేవుడని పిలిచేవారు లేరు. దేవుడు సృష్టి కార్యమును చేసిన తర్వాత రెండవ కార్యము చేయలేదు. దేవుడు ఒక్కడే అయినందున ఆయన సృష్టిపూర్వము ఒక్క కార్యమునే చేశాడు. ఒక్క కార్యము తర్వాత రెండవ కార్యమును చేయలేదు. సృష్టి తర్వాత దేవునికి ముఖ్యముగా మూడు ధర్మములు ఏర్పడినవి. అవియే రూప, నామ, క్రియలు లేనివాడు అనునవి. దేవుడు సృష్టిపూర్వము పని చేశాడు. అప్పుడు ఆయనకు ఏ ధర్మములు లేవు. సృష్టి తరువాత ధర్మములు ఏర్పడినవి కావున, సృష్టి తరువాత ఆయన ఏ కార్యమును చేయలేదు. ఆయనకు ఏ పేరు లేదు. ఆయనకు ఏ ఆకారము లేదు. అందువలన ఆయనను ఎవరూ తెలియరు.

**ప్రశ్న :- నేడు ఎందరో చనిపోతున్నారు. ఎందరో పుట్టుచున్నారు. దేవుడు సృష్టికర్త అయినప్పుడు ప్రతి దినము చనిపోయిన వారిని తిరిగి పుట్టించు కార్యమును చేయుచున్నాడు కదా! సర్వజీవరాసులను సృష్టించు కార్యములను నిత్యము చేయువానిని కార్యములు చేయువాడు అనక, కార్యములను చేయని వాడు అని ఎలా చెప్పాలి? అలా చెప్పుట అసత్యమును చెప్పినట్లు కాదా? దీనికి మీరు ఏమంటారు?**

**జవాబు :** నా జవాబును తెలియుటకు ముందు నీవు నన్ను విశ్వసించవలసి యుండును. నేను సత్యమునే చెప్పెదనని నన్ను నీవు విశ్వసించినప్పుడు నామాటను వినగలవు, అనగా నా మాటలోని సత్యమును గ్రహించగలవు. నేను చెప్పుమాట శాస్త్రబద్ధమైనదని తెలియగలదు. అదే భావమును కల్గి

ఇప్పుడు నేను చెప్పుమాటను వింటే వాస్తవమైన జవాబు తెలియగలదు. మూడు దైవ గ్రంథములలోని దైవజ్ఞానమునే చెప్పుచున్నానని కూడా మీకు అర్థమగును. 'దేవుడు' అనగా పరిశుద్ధాత్మయని పిలువబడు పరమాత్మ ప్రపంచమును సృష్టించిన సృష్టికర్తే గానీ, జీవరాసులను సృష్టించిన సృష్టికర్త కాడు. నేడు జీవరాసులను సృష్టిస్తున్న సృష్టికర్త వేరు. మొట్టమొదట ప్రపంచమును సృష్టించిన సృష్టికర్త వేరు. మొదట ప్రపంచమును సృష్టించిన సృష్టికర్తయిన పరమాత్మ రెండవమారు పనిని చేయలేదు. ఆ లెక్కప్రకారము పరమాత్మ జీవరహితమైన సృష్టియైన ప్రపంచమును సృష్టించాడు. ఆ లెక్కప్రకారము మొదట జీవరాసులు లేని ప్రపంచము సృష్టింపబడినది. సృష్టిపూర్వము పని చేసిన పరమాత్మ రెండవమారు తన సృష్టి తర్వాత పనిని చేయనివాడై, జీవరూపమైన ప్రపంచమును సృష్టించు నిమిత్తము తననుండి ఆత్మను బయటికి పంపాడు. తాను పంపిన ఆత్మచేత జీవరూపమైన ప్రపంచమును తయారు చేశాడు. తాను పని చేయకున్నను సర్వజీవరాసులనూ సృష్టించు నిమిత్తము ఆత్మను తన నుండి బయటికి పంపాడు.

జీవరాసులు లేని ప్రకృతిని తయారు చేసిన సృష్టికర్త పరమాత్మకాగా, జీవరాసులను సృష్టించిన సృష్టికర్త ఆత్మయని చెప్పవచ్చును. ఈ విధముగా సృష్టికర్తలు ఇద్దరనీ, ఒకరు ప్రపంచమును సృష్టించగా, మరియొక్కడు జీవరాసులను సృష్టించాడు. జీవరాసులను సృష్టించు అధికారమును ఆత్మ పరమాత్మ వద్దనుండి పొందడమైనది. పరమాత్మ తండ్రి కాగా, ఆత్మ పరమాత్మకు మానసపుత్రుడుగా యున్నాడు. దేవుడు తన సంకల్పము చేత ఆత్మను తయారగునట్లు చేసి, జీవరూపమైన సర్వజీవరాసులను ఆత్మ చేత సృష్టింపబడునట్లు పరమాత్మ ఆత్మకు సర్వ అధికారములు ఇచ్చాడు. అప్పటినుండి నేటివరకు సర్వజీవరాసులను ఆత్మే సృష్టించుచున్నది, పరమాత్మ

ఏ పనినీ చేయలేదు. పరమాత్మ సృష్టి పూర్వము పని చేశాడుగానీ, సృష్టి తర్వాత పనిని చేయలేదని చెప్పవచ్చును. సృష్టి తర్వాత పరమాత్మ ఏ పనీ చేయక ఊరకయుండు వాడు కాగా, ఆత్మ సర్వకార్యములను చేయుచున్నాడు. అందువలన ఆత్మను 'కార్యకర్త'యని చెప్పగా, పరమాత్మను 'క్రియారహితుడు' యని అన్నారు.

**ప్రశ్న :- ప్రప్రథమ సృష్టికర్తయిన పరమాత్మ ప్రపంచము తయారయిన తర్వాత క్రియారహితుడైపోయాడు కదా! అన్ని పనులను దేవుని స్థానములో ఆత్మయుండి పని చేయుచున్నది కదా! అటువంటప్పుడు పరమాత్మ అవసరమే లేదు కదా! ఆత్మే సర్వకార్యములను చేయుచుండుట వలన, ఏ కార్యమును పరమాత్మ చేయనిదానివలన, మనిషికి ఆత్మ అవసరమున్నది గానీ, పరమాత్మ యొక్క అవసరము లేదు కదా! అటువంటప్పుడు పరమాత్మను మనము చెప్పుకోవలసిన పని లేదు కదా! యని కొందరు అడుగవచ్చును. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** ఒక ఇంటిలో కొడుకు, కొడుకుకు తండ్రి, తండ్రికి తండ్రి యున్నాడనుకొనుము. అప్పుడు మనిషి, తండ్రి, తాతయున్నట్లు తెలియును కదా! కుమారుడు, తండ్రి, తాత ముగ్గురు యుండగా తాతయైనవాడు సంసార బాధ్యతలన్నీ తన కొడుకుకు అప్పజెప్పి, తాత పనిని చేయక ఊరక యుండును. ఎప్పుడయినా అవసరమొస్తే సలహా చెప్పడము తప్ప ఏ పనినీ చేయడము లేదు. తాత పనిని చేయనివాడని ఆయనను గౌరవించక యుందువా, అన్నము పెట్టక యుందువా? ఇంటిలో పెద్దవాడయిన దానివలన అతనిని గౌరవిస్తూ తెలియని విషయములను అడుగగా, అతను సలహాలు ఇస్తూయుండును. తాతయిన వాడు పనిని చేయకున్నను, మనువడు మరియు కొడుకు ఇద్దరూ తాతను గొప్పగా చెప్పుకొనుచూ

గౌరవిస్తున్నారు కదా! అదే విధముగా మనిషికి తాతవలె యున్న పరమాత్మను కొడుకయిన ఆత్మ, మనువడయిన జీవాత్మ అమితముగా చెప్పుకొంటున్నారు. దేవుడయిన పరమాత్మ పాత్ర లేకున్నా ఇంట్లో తాతవలె గౌరవింపబడడమే కాక, ఆయనను దేవుడని చెప్పుకొంటూ, దేవుడన్న భయము కల్గియున్నారు.

**ప్రశ్న :- ఒక మనిషికి దేవుడయిన పరమాత్మ తాతలాంటి వాడు, ఆత్మ తండ్రిలాంటి వాడు. లోపల జ్ఞానము ప్రకారము చూస్తే మనిషికి తండ్రి ఆత్మ, తాత పరమాత్మయని చెప్పక తప్పదు. అయితే మనిషి అజ్ఞానములో కూరుక పోయి దేవుడను భావము కల్గియున్నా, దేవుడంటే ఆత్మనా లేక పరమాత్మనా యని తెలియక ఆత్మను వదలివేసి పరమాత్మను దేవుడని చెప్పుచున్నారు. ఇంట్లో తండ్రితో మాట్లాడక, నేరుగా తాతతో మాట్లాడడము వలన తండ్రిని అవమానపరచినట్లు కదా! అదే విధముగా మనుషులు పరమాత్మను ఆరాధించడము చేయుచూ, ఆత్మను ఏమాత్రము తెలియక ఉన్నారు. అన్ని మతముల వారు అలాగే చేయుచున్నారు. ఈ విషయములో దేవుడు చెప్పిన జ్ఞానము ప్రకారము పరమాత్మను ఆరాధించవలెనా లేక ఆత్మను ఆరాధించవలెనా?**

**జవాబు :-** ఈ విషయములో చాలామంది తెలియక తికమకపడుచున్నారు. అయితే దేవుడు తన గ్రంథము అయిన అంతిమ దైవగ్రంథములో **"ఆత్మను ఆరాధించండియనీ, నాకు భయపడండియని"** చెప్పాడు. దానివలన భక్తి ఆత్మ మీద, భయము పరమాత్మ మీద కల్గియుండవలెనని తెలియుచున్నది. అదే విషయమునే మిగతా రెండు గ్రంథములయందు కూడా చెప్పియున్నారు. ద్వితీయ దైవగ్రంథములో **"కుమారున్ని ఘనపరచిన వాడు తండ్రిని ఘనపరచినట్లేయని"** చెప్పారు. ఎవరిని ఆరాధించవలెనను విషయము దైవ గ్రంథములలో చెప్పియున్నా, మనుషులు మాత్రము దైవ గ్రంథములలో

దేవుడు చెప్పినట్లు ఆచరించక, తమ స్వంత నిర్ణయముతో ముందుకు పోవుచున్నారు. తాము చేయు ప్రార్థన ఎవరికి చెందుతుందో కూడా తెలియక తాము చేయునదే నిజమైన మార్గము అనుకొంటున్నారు. వాస్తవముగా చెప్పితే మూడు మతముల వారు దేవుడు చెప్పినట్లు ఆరాధించడము లేదు. అంతేకాక ఆత్మయే తమకు దేవుడని భావించక నేరుగా పరమాత్మనే ఆరాధించుచున్నారు. వాస్తవానికి ఆత్మ దేవుడనీ, ఆత్మనే ఆరాధించవలెనని తెలియనివారు కలరు. ఆత్మ తమకు ఆరాధింపతగిన దేవుడుకాగా, పరమాత్మను ఆరాధించకూడదనీ, పరమాత్మ ఆరాధింపతగిన దేవుడు కాడనీ, ఆత్మనే ఆరాధించవలెనని తెలియనివారు మూడు మతములలో గలరు. మనిషి భక్తియంతయూ ఆత్మకే చెందవలసియున్నది. పరమాత్మ సాక్షి భూతుడుగాయున్నాడు తప్ప ఆరాధన స్వీకరించువాడుగా లేడు.

మనిషి భూమిమీద పుట్టినప్పటి నుండి ఆకలయితే పాలకోసము ఏడ్వను ప్రారంభించి, పెద్దయిన తర్వాత బ్రతికేదానికి ధనము కొరకు ప్రాకులాడు చున్నాడు. జరుగబోవు కాలములో చస్తానో, బ్రతుకుతానో యని తెలియక పోయినా బ్రతుకుతానని నమ్మకముతోనే ప్రపంచ మార్గములో పోతూనే ఉన్నాడు తప్ప దైవమార్గమును గురించి ఆలోచించడము లేదు. 'నలుగురితో పాటు నారాయణ' అన్నట్లు భక్తి లేదనకుండా సంవత్సరమునకు ఒకమారో రెండుమార్లో గుడికి పోయో లేక తీర్థయాత్రలు చేసో నేనూ భక్తికలవాడనే యని చెప్పుకొంటున్నాడు. ఈ విధముగా దైవమార్గములో దారితప్పి నడుస్తున్నా అందరూ తమకు తాము జ్ఞానులమేయనుకోవడము జరుగుచున్నది. దైవమార్గములో దారితప్పిన సమాజమును ధర్మములు తెలియజేసి సక్రమమార్గములో నడుచునట్లు చేయుటకు, దేవుడు భూమిమీదికి మనిషివలె వచ్చి, తన జ్ఞానమును తానే స్వయముగా తెలియజేయవలసి యున్నది. అదే విధముగా

గతములో దేవుడు మనిషివలె రావడము, దైవ ధర్మములు తెలిపిపోవడము జరిగినది. ఎప్పుడయితే భూమిమీద మనుషులలో దైవ జ్ఞానము లేకుండా పోవుచున్నదో, ఎప్పుడయితే ధర్మములు తెలియకుండా పోయి అధర్మ కార్యములు చెలరేగిపోవునో అప్పుడు దేవుడు తన ధర్మములను తెలియజేయు నిమిత్తము మనుషుల మధ్యలోనికి మనిషివలె రావలసియుండును. అయితే గతములో ఎన్నోమార్లు వచ్చి తన జ్ఞానమును చెప్పిపోయినట్లు కొన్ని ఆధారముల వలన తెలియుచున్నది.

దేవుడు భూమిమీద మనిషివలె అవతరించి వస్తే ఆయనను ఎవరూ గుర్తించలేరు. ఎవరూ గుర్తించనట్లు భూమిమీద మనిషి రూపములో నటించి పోవును. దేవుడు మనిషివలె వస్తే జ్ఞానులు సహితము ఆయనను గుర్తించలేరు. అటువంటపుడు అజ్ఞానులయిన వారికి దేవుని అవతార విషయము ఏమీ తెలియదనియే చెప్పవచ్చును. దేవుడు ఎన్నిమార్లు భూమిమీద మనిషిగా వచ్చాడో చెప్పలేము గానీ, కొన్నిమార్లు వచ్చి పోయాడని చెప్పుటకు కొంత ఆధారము గలదు. గడచిన నాలుగు యుగములలో మొదటి యుగము అయిన కృతయుగములో ఆకాశము ద్వారా సూర్యునికి "జపర" జ్ఞానమును చెప్పగా, సూర్యుడు కొంతకాలమునకు భూమిమీద 'మనువు' అను వ్యక్తికి చెప్పగా! మనువు ద్వారా మరొకరికి, అతని ద్వారా ఇంకొకరికి జ్ఞానము తెలియుచూ పోగా, కొన్నివేల సంవత్సరములకు భూమిమీద అంతయూ జ్ఞానము వ్యాపించినది. ఏ విధముగా జ్ఞానము అంచెలంచెలుగా ప్రాకినదో అలాగే కొన్ని వేల సంవత్సరములకు జ్ఞానము అంచెలంచెలుగా లేకుండా పోయినది. అలా అన్ని దేశములలో దైవజ్ఞానము లేకుండా పోయినా, భారతదేశములో మాత్రము అన్ని దేశములవలె అజ్ఞానము వ్యాపించక సంపూర్ణ జ్ఞానము కల్గియుండెను. అందువలన భారత దేశమునకు కృతయుగములో 'జ్ఞానుల దేశము' అని పేరు వచ్చినది.

జ్ఞానుల దేశము అని చెప్పుటకు 'ఇందువుల దేశము' అని చెప్పుచుండిరి. అట్లే కొంత కాలమునకు ఇందువుల దేశము అనకుండా 'ఇందూ దేశము' అని అనుటకు అలవాటుపడ్డారు. అట్లు కృతయుగములో వచ్చిన పేరు ఇప్పుడు కలియుగము వరకు ఇందూ దేశము అని చెప్పుచున్నా ఈ మధ్య కాలములో దాదాపు 150 సంవత్సరముల క్రితము **'ఇందూ'** అను పదము **'హిందూ'** అను పదముగా మారిపోయినది. ప్రస్తుతము ఇప్పుడు హిందూదేశముగా చెప్పబడుచున్నది. గతచరిత్ర తెలియనివారు అదే నిజమైన పేరుగా చెప్పుచూ తమను తాము హిందువులుగా పరిచయము చేసుకొంటున్నారు.

గతములో రెండువేల సంవత్సరముల పూర్వము వరకు భారత దేశములో ఇందూ సమాజము ఉండేది. అంతవరకు భారతీయులందరూ ఇందువులుగా చెప్పబడేవారు. రెండువేల సంవత్సరముల సమయములో మొదట క్రైస్థవ మతము తయారు కాగా, అంతవరకు మతప్రసక్తి లేకుండా యున్న ఇందూ సమాజము ఇందూమతముగా చెప్పబడినది. అదే నేడు హిందూమతముగా నిలిచియున్నది. గతములో లేని మతములు నేడు పెరిగిపోయి ఇప్పటికి భూమిమీద పన్నెండు మతములుగా ఏర్పడగా అందులో హిందూ, ఇస్లామ్, క్రైస్తవ మతములు మూడు ముఖ్యమైనవి. నేడు భూమిమీద పెద్ద మతములుగా యున్నవి కూడా ఈ మూడు మతములే. ఈ మూడు మతములలోనే దైవజ్ఞానము మూడు దైవగ్రంథములుగా చెప్పబడినది. భూమిమీద ప్రజల మధ్యలో దైవధర్మములు మూడు దైవ గ్రంథముల రూపములో యున్నా ప్రజలు మాత్రము దైవజ్ఞానమును సంపూర్ణముగా తెలియలేకున్నారు.

నేడు మూడు దైవ గ్రంథములను మూడు మతముల వారు పంచుకొన్నట్లు భగవద్గీత హిందువులదనీ, బైబిలు క్రైస్థవులదనీ, ఖుర్ఆన్

గ్రంథము ముస్లీమ్‌లదనీ చెప్పుకొంటున్నారు. నేడు ఎవరు ఎలా చెప్పుకొనినా మాకు తెలిసినంతవరకు మూడు దైవ గ్రంథములలోని జ్ఞానము ఒక్కటేయని చెప్పవచ్చును. మొదట పుట్టిన దానిని ప్రథమ దైవగ్రంథము అనియూ, తర్వాత పుట్టిన గ్రంథమును ద్వితీయ దైవగ్రంథము అనియూ, ఆ తర్వాత చివరిగా పుట్టిన దానిని అంతిమ దైవగ్రంథము అనియూ చెప్పుచున్నారు. అయితే మొదట పుట్టిన ప్రథమ దైవగ్రంథములోని జ్ఞానమే మిగతా రెండు గ్రంథములయందు కలదు. భగవద్గీత ప్రథమ దైవగ్రంథము కాగా భగవద్గీతలోని విషయములే మిగతా రెండు గ్రంథములలో గలవని అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్‌లో సూరా ఐదు (5) లో 44, 46, 48, 68 ఆయత్‌లు సాక్ష్యమిచ్చుచున్నవి. మొదట తయారయిన భగవద్గీతలోని జ్ఞానమును శ్రీకృష్ణుడు ద్వాపర యుగము చివరిలో చెప్పాడు. ద్వాపర యుగములో చెప్పిన భగవద్గీతలోని జ్ఞాన విషయములకు సూర్యునికి ఆకాశవాణి చెప్పిన 'జపర' జ్ఞానమే ఆధారము. ఆకాశవాణి మొదట సూర్యునికి చెప్పిన 'జపర' అనబడు జ్ఞానమే కృష్ణుని ద్వారా చెప్పబడి గ్రంథరూపము దాల్చినది. అదే జ్ఞానమే బైబిలు, ఖుర్ఆన్‌లుగా తయారయినది. ఏసు చెప్పిన జ్ఞానము బైబిలుకాగా, జిబ్రయేలు అను ఆకాశ గ్రహము (సూర్యుడు) చెప్పిన జ్ఞానము ఖుర్ఆన్‌గా తయారయినది. దీనినిబట్టి ఒకే దేవుని జ్ఞానమే మూడు గ్రంథములుగా చెప్పబడినదని తెలియుచున్నది. దైవజ్ఞానము గ్రంథ రూపముగా లేని కాలములో మొట్టమొదట దేవుడు మనిషిగా త్రేతా యుగములో వచ్చి దైవ ధర్మములను తెలియజెప్పాడు. దేవుడు మనిషిగా వస్తే ఆయనను దేవుడు అనకూడదు. 'భగవంతుడు' అని చెప్పాలియని ముందే తెలుసుకొన్నాము.

భూమిమీద దేవుడు మొట్టమొదటిగా మనిషిగా అనగా భగవంతునిగా వచ్చినది త్రేతాయుగములోనే యని చెప్పవచ్చును.

ప్రప్రథమముగా వచ్చిన భగవంతునికి ఒక ప్రత్యేకత కలదు. ఆయన మొట్టమొదట వచ్చిన భగవంతుడు అని చెప్పుటకు ఆ ప్రత్యేకతే ఆధారము యని చెప్పవచ్చును. అలాగే తర్వాత ఎన్నిమార్లు దేవుడు భగవంతుడుగా వచ్చినా వారు మొదటి భగవంతుని తర్వాత వచ్చిన భగవంతులని తెలియుటకు కూడా ప్రత్యేకమైన గుర్తు కలదు. దేవుడు మనిషిగా వచ్చుట వలన ఆయనకు మనుషులకున్నట్లే పేరు ఉండును. ఉదాహరణకు కృష్ణుడు భగవంతుడుగా వచ్చాడు కావున ఆయనకు 'కృష్ణా' యను పేరు పెట్టబడినది. దేవుడు మనిషిగా మొదట వచ్చినప్పుడు ఆయనకు కూడా పేరు ఉండుట సహజమే. అయితే ఆయన పేరుముందు భగవాన్‌యని చెప్పబడినది. తర్వాత వచ్చిన భగవంతుని పేరు వెనుక భగవాన్‌యని చెప్పబడినది. గత చరిత్రను గమనించితే త్రేతాయుగమున మొట్టమొదట వచ్చిన దేవుని అవతారము ముందర 'భగవాన్' యని చెప్పబడినది. తర్వాత ద్వాపర యుగమున వచ్చిన దేవుని అవతారమునకు పేరు చివరలో అనగా పేరు వెనుక భగవాన్ యని చెప్పారు. భగవాన్ యని మనిషిగా యున్న దేవున్ని తెలియుటే చాలాకష్టము. భగవంతున్ని తెలియుటే దుస్సాధ్యమైన పనికాగా వారు మొదటివారా, తర్వాతవారా యని తేల్చి చెప్పుట చాలా చాలా కష్టము. దేవుడు భగవంతునిగా యున్నప్పుడు ఆయనను కనుగొనలేమని తెలిసిపోయినది. అయితే దేవుడు మనిషిగా భూమిమీదికి వచ్చిపోయిన తర్వాత ఆయనను జ్ఞాన సంపన్నులైన వారు తెలియగలిగారు. కొన్నికోట్ల జనాభాలో అరుదుగా సంపూర్ణ జ్ఞానులయిన వారు గతములో వచ్చిన వాడు భగవంతుడు అని తేల్చి చెప్పగలుగుచున్నారు.

అలా సంపూర్ణ జ్ఞాన ధనులైనవారు ద్వాపర యుగములో కృష్ణున్ని కనుగొనగలిగారు. ఆనాడు ఆయన ఉన్నప్పుడు కృష్ణుడు ఫలానావాడు అని తెలియకున్నా, ఆయన పోయిన తర్వాత కృష్ణుడు సాధారణ మనిషి

కాడు అని ఆయన భగవంతుడని నేడు చెప్పుకోగలుగుచున్నారు. అదియు జ్ఞానములో పూర్తి సంపన్నులయిన వారు చెప్పుచున్నారు తప్ప మిగతా ప్రజలు ఎవరూ చెప్పడము లేదు. నేడు అజ్ఞానులైన ప్రజలు కృష్ణున్ని సాధారణ మనిషిగా లెక్కించుచూ ఆయన జారుడు, చోరుడుయని అంటున్నారు. దేవుడు భగవంతునిగా మనిషి శరీరము ధరించి వచ్చినప్పుడు ఆయన సర్వసాధారణ మనిషిగానే ప్రజల మధ్యలో కాలము గడుపుచుండును. కృష్ణుడు అలాగే యుంటూ తన జీవితములో కేవలము ఒక సందర్భములో సంపూర్ణమైన జ్ఞానమును భగవద్గీతగా చెప్పాడు. ఒక దినము అదియు కొన్ని నిమిషములు మాత్రమే జ్ఞానమును చెప్పి, మిగతా 126 సంవత్సరములు సాధారణ మనిషిగానే జార, చోర పనులు అందరికీ తెలియునట్లు, తనను భగవంతునిగా ఎవరూ గుర్తించనట్లు ప్రవర్తించి పోయాడు. దానివలన ఎవరూ ఆయనను గుర్తించుటకు వీలు లేకపోయినది. జ్ఞానులు సహితము కృష్ణున్ని గుర్తించలేకపోయారు. కృష్ణుడు భూమిమీద యున్న సమయములో కృష్ణున్ని గుర్తించలేకపోయినా నేడు మా దృష్ఠిలో కృష్ణుడు దేవుని అవతారమైన భగవంతునిగా తెలియబడినాడు. నాకు తెలియబడక ముందు జ్ఞాన సంపన్నులయిన వారికి తెలియడము వలన వారు ముందే కృష్ణున్ని భగవాన్ యను పేరుతో పిలుస్తూ **"శ్రీకృష్ణ భగవాన్"** యని అన్నారు.

కృష్ణుని పేరు వెనుక భగవాన్‌యని చెప్పబడుట చేత ఆయనకంటే ముందు వచ్చిన భగవంతుడు ఇంకొకరు ఉన్నారు. మొట్టమొదట వచ్చిన భగవంతుని తర్వాత వచ్చిన భగవంతుడు కృష్ణుడు అగుట చేత ఆయన పేరు వెనుక భగవాన్‌యని ఉన్నట్లు తెలియుచున్నది. మొదట వచ్చిన భగవంతుడు ఎవరు? అను ప్రశ్న దీనితో వస్తున్నది. మొదట భగవంతున్ని గురించి తెలియుటకంటే ముందు ద్వాపరయుగములో వచ్చిన భగవంతున్ని

అనగా కృష్ణున్ని గురించి కొంత తెలుసుకొందాము. కృష్ణుడు తన జీవితములో ఒకమారే ఆత్మజ్ఞానమును చెప్పినా, తనను గురించి "నేను దేవున్ని" యని తన బోధలో ప్రకటించుకొన్నాడు. తననే మ్రొక్కమని కూడా చెప్పాడు. భగవద్గీత బోధలో "నేను సర్వజీవరాసులకు దేవున్నయి కూడా మానవ అవతారములో మనుషుల మధ్యలోనికి వచ్చాను. అయినా మూర్ఖులైన మనుషులు మూఢులై నన్ను అవమానించుచున్నారు" యని కూడా చెప్పాడు. ఈ విధముగా తనలోని దైవత్వమును గుర్తించాలను ఉద్దేశ్యముతో కృష్ణుడు నేనే దేవున్నియని ప్రకటించుకొనినా, అజ్ఞానులు గుర్తించ లేకపోయారు. తాము గుర్తించలేకపోయినా గుర్తించిన జ్ఞానులు ఈయనే భగవంతుడు అని చెప్పినా వినని మనుషులు కృష్ణుడు మోసగాడు, మాయగాడు, జారత్వము కల్గినవాడు, చోరత్వము కల్గినవాడని చెప్పుచుందురు. కృష్ణుడు భగవంతుడైనా, ప్రజలు మాత్రము ఆయనను సాధారణ మనిషిగానే లెక్కించుచున్నారు తప్ప ఇతరముగా చూడడము లేదు. కృష్ణుడే త్రేతాయుగములో రామునిగా పుట్టియున్నాడని చాలామంది స్వామీజీలు చెప్పుచుందురు. దాని ప్రకారమే మిగతా వారందరూ రాముడు కృష్ణుడు ఒక్కరేయని అంటున్నారు.

త్రేతాయుగములో శ్రీరాముడు సచ్ఛీలుడు. ఆయన జీవితములో అనేక కష్టములను ఎదుర్కొన్నాడు. 16 లేక 17 సంవత్సరములకే అరణ్య వాసమునకు పోయాడు. 14 సంవత్సరముల వరకు అరణ్యవాసము చేశాడు. తన 30వ సంవత్సరములో రావణునితో యుద్ధము చేశాడు. తర్వాత అయోధ్యకు వచ్చినా తిరిగి తన భార్యయైన సీతను అరణ్యమునకు పంపాడు. తర్వాత సీత లేక ఒంటరి జీవితమును గడిపాడు. తనకు 46 సంవత్సరములప్పుడు తన కుమారులైన లవకుశులను మరియు భార్య సీతను కలువడము జరిగినది. అప్పుడు సీతను తిరిగి అయోధ్యకు రమ్మని

పిలువగా సీత నిరాకరించినది. తర్వాత జీవితము కూడా భార్య వియోగముతో బాధాభరితముగా గడిపాడు. శ్రీరాముడు ఎక్కడా ఆత్మజ్ఞానమును చెప్పినట్లు చరిత్ర లేదు. రాముడు జ్ఞానమును చెప్పకున్నా రామున్ని దేవుడని ప్రజలందరూ అనడము జరుగుచున్నది. రాముడు కృష్ణుడు ఇద్దరూ ఒక్కరే యను వారు రామున్ని దేవుడు అని అనుచూ కృష్ణున్ని దొంగ, మోసగాడు, ఆడవారి వెంట తిరుగువాడు యని చెప్పుచుందురు. రాముడు దేవుడు అయినప్పుడు కృష్ణుడు కూడా దేవుడేయగును కదా! రామ రామ కృష్ణ కృష్ణ యనుచూ పాటలు పాడువారు కూడా రామున్ని దేవున్ని చేసి కృష్ణున్ని దొంగను చేశారు. దొంగలందరూ కృష్ణున్ని మా వృత్తి దేవుడుయని అంటున్నారు. రామున్ని ఆకాశమంత ఎత్తినవారు కృష్ణున్ని పూర్తి క్రిందికి వేసినట్లు మాట్లాడుచున్నారు.

ఇంతవరకు దేవుడు భూమిమీదికి మానవ అవతారములో ఎన్నిమార్లు వచ్చాడో ఖచ్చితముగా ఎవరూ చెప్పలేరు. అయినా తెలిసినంత వరకు శాస్త్రబద్ధమైన ఆధారముతో చెప్పితే మూడుమార్లు వచ్చాడని చెప్పవచ్చును. నేడు నాకు భగవంతుని విషయము కొంత తెలిసినా త్రేతా యుగములో ఫలానావాడు భగవంతుడనిగానీ, ద్వాపర యుగములో ఫలానా వాడు భగవంతుడనీ, అట్లే కలియుగములో ఫలానావాడు భగవంతుడుగా ఉండిపోయాడు అని సత్యమును చెప్పుటకు కూడా భయపడవలసి వస్తున్నది. అలా ఎందుకు భయపడవలసి వస్తున్నదంటే నేటి ప్రజలు గతములో వచ్చిన ముగ్గురు భగవంతులను గుర్తించక పోగా వారిని నీచులు, దుర్మార్గులు, దొంగలుగా చెప్పుకొంటున్నారు. అట్లువారు ఎవరినయితే చెడ్డవారిగా చెప్పుకొంటున్నారో వారిని నేను భగవంతులు యని అంటే ప్రజలలో అజ్ఞానులయిన వారికి పూర్తి వ్యతిరేఖముగా చెప్పినట్లగుచున్నది. ద్వాపర యుగములో యున్న కృష్ణుడు, త్రేతాయుగములో శ్రీరామునిగా

ఉన్నాడని చాలామంది చెప్పుచున్నా, చివరకు కృష్ణున్ని చెడు వ్యక్తిగానే చెప్పుచున్నారు.

కలియుగములో రెండువేల సంవత్సరముల క్రిందట దేవుడు భగవంతునిగా వచ్చాడనీ, అలా వచ్చిన భగవంతుడే ఏసుయని చెప్పితే క్రైస్థవులలో కూడా కొందరు వ్యతిరేఖిస్తున్నారు. కొందరు నిజమేనని సంతోషించుచున్నారు. ఇతర మతముల వారయితే పూర్తి వ్యతిరేఖించు చున్నారు. హిందువులయితే ఏసు పేరు చెప్పితే మండిపడుచున్నారు. వారు స్వమతాభిమానముతో యుంటూ పరమతమును ద్వేషించువారిగా యుండుట వలన ఏసు అను మాటను వింటూనే అలర్జి వచ్చిన వారివలె వ్యతిరేఖ భావమును వ్యక్తపరచుచున్నారు. ఏసును భగవంతుడంటే ఎవరూ ఒప్పుకోరు. ప్రజల దృష్టికి కనపడి తమను ప్రజలు తెలియు నిమిత్తము తమను తాము దేవుడని చెప్పుకొనినా, ప్రజలు వారిని ఒప్పుకోనప్పుడు నేను దేవున్నియని ఏమాత్రము చెప్పని వాడు, ప్రజలలో పూర్తి చెడువానిగా ప్రచారమయిన వానిని, నేను భగవంతుడు అంటే ప్రజలు ఒప్పుకోకపోగా చెప్పిన నన్ను అనేక ఇబ్బందులకు గురిచేయుచున్నారు. నేను హిందువునయి ఉండినప్పటికీ వారు నన్ను హిందువు కాదు పరాయి మతస్థుడని చెప్పు చున్నారు. నేను జ్ఞానము చెప్పుతూ యున్నా నన్ను అజ్ఞానిగా చెప్పుచున్నారు.

**ప్రశ్న :- ద్వాపర యుగములో కృష్ణున్ని భగవంతుడని కొందరు చెప్పారు. చెప్పడమే కాకుండా వ్యాసుడు భగవద్గీతలో కృష్ణున్ని భగవంతునిగా చెప్పుచూ భగవంతుడిట్లనియె (భగవానువాచ) అని చెప్పియున్నాడు. అందువలన కృష్ణుడు భగవంతుడని చెప్పుటకు కొంత ఆస్కారమున్నా కొందరు హిందువులే కృష్ణున్ని దేవునిగా ఒప్పుకోవడము లేదు. ఏసు విషయములోనికి వస్తే మీరు ఏసు భగవంతుడని చెప్పుమాటను క్రైస్థవులే ఒప్పుకోవడము లేదు. ఏసు దేవుని కుమారుడేగానీ, దేవుడు కాదు యని అంటున్నారు. ఏసు**

**దేవుని కుమారుడయిన దానివలన, ప్రజలు కూడా దేవుని కుమారులే అగుట వలన ప్రజలు మాకు ఏసు సోదరుడుగా యున్నాడని క్రైస్థవులు చాలామంది అంటున్నారు. బహుకొద్ది మంది మాత్రము మీ మాటను సత్యమే అంటున్నారు. మిగతా క్రైస్థవులంతా ఏసును దేవుని కుమారునిగానే చెప్పు చున్నారు తప్ప దేవునిగా ఒప్పుకోవడము లేదు. అటువంటప్పుడు క్రైస్థవ మతములోనే ఏసును భగవంతునిగా ఒప్పుకోనప్పుడు, మీరు చెప్పిన ద్వాపర యుగ కృష్ణున్ని, కలియుగ ఏసును భగవంతునిగా విశ్వసించనప్పుడు ఎవరూ ఇంతవరకు త్రేతాయుగములో భగవంతుడు వచ్చాడని చెప్పకున్నా ఎవరినో మీరు భగవంతునిగా చెప్పితే ప్రజలు నమ్ముతారా?**

**జవాబు :-** నమ్మకము అనునది ముఖ్యము కాదు. నమ్మకము అనునది సత్యము కావచ్చును, అసత్యము కావచ్చును. కొందరు నమ్మితే అది సత్యము, నమ్మకపోతే అసత్యము అని చెప్పుటకు వీలులేదు. నమ్మకము మీద ఆధారపడి సత్యము ఉండదు. అందువలన కొందరు పెద్దలు ఇలా అన్నారు. **"అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు. సత్యమును వేయి మంది కాదనినా అది అసత్యము కాదు."** ఈ మాటనుబట్టి ప్రజల నమ్మకము మీద సత్యము ఆధారపడి లేదు. సత్యమును ఎవరు ఒప్పుకోక పోయినా అది ఎప్పటికీ సత్యముగానే ఉండునుగానీ అసత్యముగా మారుటకు అవకాశము లేదు. కోడి గ్రుడ్డును ఇది కోడిగ్రుడ్డు కాదుయని ఎంతమంది చెప్పినా, అది కోడి గ్రుడ్డుగానే ఉండునుగానీ, పాము గ్రుడ్డుగానో, ఇతర పక్షి గ్రుడ్డుగానో మారదు కదా! అట్లే ఆవుపాలను కొందరు తెలియక గాడిద పాలు అని చెప్పినంతమాత్రమున అవి ఆవుపాలు అనుట సత్యము గానే ఉండును. అట్లే గాడిద పాలను ఆవుపాలు అని చెప్పినా అవి ఎప్పటికీ

ఆవు పాలు కావు. అదే విధముగా ప్రజల నమ్మకమును బట్టి సత్యాసత్యములు ఆధారపడియుండవు. ఏసును దేవుని కుమారుడని దైవగ్రంథములో చెప్పియున్నారని కొందరు చెప్పుచున్నారు. దాని ప్రకారము ఏసు దేవుడు కాదుయని కొందరు చెప్పుచున్నారు. ఎవరి ఇష్టము వారిది, ఎవరి నమ్మకము వారిది. ఏసును దేవుడు కాదని వారనుట వలన ఆయన దేవుడు కాకుండాపోడు. అట్లే కృష్ణున్ని చాలామంది ఆయన చేసిన పనులను బట్టి మోసగాడు అని అన్నారు. అట్లే ఆయన చెప్పిన జ్ఞానమునుబట్టి ఆయనను దేవుడే యని అనవచ్చును కదా! ఏసునుగానీ, ద్వాపర యుగము లోని కృష్ణున్నిగానీ భగవంతునిగా ప్రజలు నమ్మకపోయినంత మాత్రమున వారు ఇంకొకరిగా మారుటకు అవకాశము లేదు. త్రేతాయుగమున భగవంతున్ని గురించి ఇంతవరకు ఎవరూ చెప్పకున్నా, త్రేతాయుగములో రామున్ని అనగా ధశరథ పుత్రున్ని ప్రజలు దేవుడు అని అనుచున్నారు. వారి నమ్మకము వారిది. వారి మాటను కాదనినా, వారి మాటను ఔననినా, రాముడు రాముడుగానే ఉండును. రాముడు దేవుడయితే ఆయన దేవుడుగానే ఉండును. ఒకవేళ ఆయన దేవుడు కాకపోతే దేవుడు కాకనే యుండును. అంతేగానీ మన ఉద్దేశ్యము అక్కడ ఏమీ పని చేయదు. అందువలన చాలామంది రామున్ని దేవుడు అని అంటూవుంటే నేను కాదనలేదు. రాముడు దేవుడే అయివుండవచ్చును. అందరూ నమ్మినట్లే నేను కూడా నమ్ముచున్నాను. రాముని కాలములో రామునికి ప్రత్యర్థి ఒకరు ఉండేవారు. ఆయన పేరే రావణబ్రహ్మ. రావణబ్రహ్మ మహాజ్ఞానియని, త్రికాల జ్ఞానియని కొందరు జ్ఞానులు చెప్పగా విన్నాను. రావణుడు అంతపెద్ద జ్ఞాని అయినప్పుడు రాముడు దేవుడని తెలియలేకపోయాడా? ఏ జ్ఞానములేని

సాధారణ మనుషులు కూడా రాముడు దేవుడని తెలిసి చెప్పుచున్నప్పుడు ఎంతో జ్ఞానము గల రావణుడు రామున్ని ఎందుకు గుర్తించలేకపోయాడు? ఎందరో ప్రజలు విశ్వసించిన తర్వాత ఆయన ఎందుకు విశ్వసించలేదు?

ప్రశ్న :- **రావణబ్రహ్మ మహా జ్ఞానియని కొందరు అనుట మేము కూడా విని యున్నాము. అంత జ్ఞాని అయినవాడు ప్రజలలో మంచివాడుగా లెక్కించబడలేదు. దానికి కారణము అందరూ ఒకే ఒకటి చెప్పుచున్నారు. అదే 'సీతను రావణుడు అపహరించుకు పోయాడు' అని చెప్పుచున్నారు. ఆ పనిని రావణుడు చేయకపోతే ఆయనను ప్రజలు మంచివాడుగా గుర్తించే వారేమో?**

**జవాబు :-** ద్వాపరయుగములోని కృష్ణుడు, కలియుగములోని ఏసు రావణుడు చేసినట్లు ఇతరుల భార్యలను అపహరించలేదు కదా! అయినా వారిని ప్రజలు మంచివారుగా చెప్పడము లేదు. కృష్ణున్ని, ఏసును చెడ్డవారిగానే చిత్రీకరించారు కదా! ఏదో ఒక సాకుతో మంచివారిని కూడా చెడుగా చెప్పుట భూమిమీద ప్రజలకు అలవాటైపోయినది. అట్లే ఏ మంచి పని చేయకున్నా కొందరిని మంచివారుగా చెప్పుచుందురు.

ప్రశ్న :- **ప్రజలలో ఎందరో తెలివైనవారున్నారు కదా! వారు కూడా రావణున్ని చెడుగా, రామున్ని మంచిగా చెప్పుచున్నారు. అందులో సత్యమెంత అసత్యమెంత యని ఆలోచిస్తే వారు సత్యముకంటే అసత్యమునే ఎక్కువగా చెప్పుచున్నారని తెలిసినది. మనుషులకు ఒక చెడు అలవాటు గలదు. ఎవడయినా ఒకడు కొద్దిగా గుర్తింపుయున్నవాడు ఏమి చెప్పితే అది నిజమే యని నమ్మి అతను చెప్పిన విషయమునే ప్రజలు కూడా చెప్పుచుందురు. ఎవరయినా తాము విన్న విషయములో నిజమెంత, అబద్ధమెంత అని ఆలోచించరు. రావణుడు సీతను తీసుకుపోయినది వాస్తవమే, అయితే**

**ఆమెను ఆయన ఏ ఉద్దేశ్యముతో తీసుకపోయాడని ఏమాత్రము చూడకున్నారు. ఇతరులు చెప్పిన దానినే నమ్మి రావణుడు మంచివాడు కాడు, సీత మీద కామముతో సీతను బలవంతముగా తీసుకుపోయాడు అని చెప్పుచున్నారు. రావణుడు సీత మీద చెడు ఉద్దేశ్యము కలిగి ఆమెను తీసుకుపోయాడా లేదా? లేకపోతే ఏ ఉద్దేశ్యముతో తీసుకుపోయాడు? అను ప్రశ్న నేడు మాకు వచ్చినది. నేను ప్రజల మాటను గ్రుడ్డిగా నమ్మక అందులో సత్యముందా, అసత్యమున్నదాయని తెలియాలనుకొన్నాను. మీరు ఉన్నది ఉన్నట్లు చెప్పగలరను విశ్వాసముతో సత్యసమేతముగా ఈ విషయమును తెలియజేయాలని కోరుచున్నాను?**

**జవాబు :-** రాముడు దేవుడనీ, రావణుడు రాక్షసుడనీ ప్రజలు అంటున్నారు. రాక్షసుడు అంటే దేవతలకు విరుద్ధముగా చేయువాడు, దుర్మార్గుడని ప్రజల భావము. పండితులు కూడా పూర్తి చెడ్డవానిని రాక్షసుడని చెప్పడము జరిగినది. రాముడు మనిషే, రావణుడు మనిషే అయితే రాముడు దేవుడు ఎలా అయ్యాడో, రావణుడు రాక్షసుడు ఎలా అయ్యాడో నాకు మాత్రము తెలియదు. ఇతరులు చెప్పుతుంటే విని, విన్నది సత్యమా అసత్యమా యని ఆలోచించక అందరివలె మాట్లాడడము నా చేతకాదు. అందువలన గ్రుడ్డిగా నేను ఏదీ చెప్పను. రాముడు, రావణుడు ఒకే కాలములో నివసించారు అన్నది మాత్రము వాస్తవమే. కృష్ణుని విషయములో చూస్తే ప్రజలు మాట్లాడిన మాటలకు జరిగిన సంఘటనలకు సంబంధము లేకుండా యున్నది. కృష్ణున్ని చిన్నపిల్లవాడుగా చిత్రపటమును చూపారు. తర్వాత ఆయన ఎప్పటికీ యువకునిగానే యున్నట్లు చూపారు. కౌరవులకు, పాండవులకు జరిగిన భారతయుద్ధములో కృష్ణుని వయస్సు దాదాపు తొంభై ఆరు (96) సంవత్సరములు. యుద్ధము జరిగిన ముప్పై (30) సంవత్సరము లకు ఆయన చనిపోవడము జరిగినది. అయితే యుద్ధ సమయములో

కృష్ణుని చిత్రమును యువకునిగా యున్నట్లు చూపడము జరిగినది. వాస్తవముగా వృద్ధవయస్సులో రథసారథ్యమును చేసినట్లు చరిత్ర యుండగా, యుద్ధ సమయములో కృష్ణున్ని యువకునిగా చూపడము పూర్తి అసత్యమును చూపినట్లే కదా!

ఈ విధముగా ఎన్నో విషయములలో అసత్యమును కొందరు రచయితలు, పండితులు ప్రచారము చేయగా దానిని విన్న ప్రజలు విచక్షణను కోల్పోయినవారై వారి మాటనే సత్యమని నమ్మి దానినే ఒకరికొకరు చెప్పుకోగా పూర్తి అసత్య ప్రచారము జరిగిపోవుచున్నది. కృష్ణుని విషయములో ఆయన ఏ వయస్సులో ఏ పనిని చేశాడని ఆలోచించకుండా ప్రచారము చేసినట్లు, రావణుని కాలములో కూడా రావణుడు ఏ వయస్సులో ఏ పనిని చేశాడని తెలియకుండానే అన్ని పనులు యుక్తవయస్సు యున్నప్పుడు చేసినట్లు వ్రాసుకోవడము, చిత్రించుకోవడము, చెప్పుకోవడము వలన రావణుని విషయములో కూడా అసత్య ప్రచారము జరిగిపోయినదని తెలిసినది. రావణుని కాలములో కొన్ని సంఘటనలు జరిగినవి వాస్తవమే. అయితే అవి రావణునికి ఏ వయస్సు ఉన్నప్పుడు జరిగాయని ఆలోచించక అన్ని పనులు ఒకే వయస్సులో చేసినట్లు చెప్పుకోవడము పెద్ద తప్పు. అదే తప్పునే అందరూ చెప్పుకొనుచూ, కొందరయినా 'ఏది సత్యము?' అని ఆలోచించకపోవడము మరీ పెద్ద తప్పు.

రావణునికి చెడ్డ పేరు వచ్చినది 'సీతను అపహరించాడు' అను సంఘటనలోనే. ఆ సంఘటన జరిగినది వాస్తవమే. అయితే ఆయన ఏ వయస్సులో, ఏ ఉద్దేశ్యముతో ఆ పనిని చేశాడని ఎవరూ కొద్దిమాత్రమయినా ఆలోచించలేదు. అదే విధముగా 'సీత స్వయంవరమునకు రావణుడు పోయి శివధనస్సును ఎత్తలేక పరాభవము చెందాడని' చెప్పడము కూడా ముఖ్యముగా వింటున్న సమాచారమే. రావణుడు సీత స్వయంవరము తర్వాత 14 సంవత్సరములకు సీతను తన విమానములో తీసుకపోయినట్లు

చెప్పుచున్నారు. సీత స్వయంవరమునకు జనకుడు చాలామంది పెళ్లికాని యువరాజులకు లేక రాజకుమారులకు ఆహ్వానము పంపాడు. సహజముగా ఏ తండ్రి, పెళ్లి అయిన వానికి తన కూతురునిచ్చి పెళ్లి చేయాలనుకోడు. అందువలన పెళ్లి అయిపోయిన రావణునికి జనకుడు స్వయంవర ఆహ్వానమును పంపాడనుట పూర్తి అవాస్తవము. సీత స్వయంవర సమయమునకు రావణబ్రహ్మకు పెళ్లి అయిన కుమారుడున్నాడు. రావణుని కొడుకుకు కొడుకుయుండగా రావణుడు తన మనువని సమేతముగా, కొడుకు సమేతముగా లంకలో యున్నాడు. సీత స్వయంవర సమయానికి రావణుని వయస్సు దాదాపు 85 సంవత్సరములు ఉండవచ్చును. ఆ వయస్సు వానికి సీత తండ్రి జనకుడు ఆహ్వానము పంపాడనుట ఎంత అనుచితమో మీరు బుద్ధిని ఉపయోగించి ఆలోచించండి. కొంత బుద్ధిని ఉపయోగించి చూచినా రావణుడు సీత స్వయంవరమునకు పోయాడు అనుట పూర్తి అసత్యము. అట్లే జనకుడు రావణునికి ఆహ్వానము పంపాడనుట కూడా పూర్తి అసత్యము.

అప్పటి కాలములో సముద్రమును దాటుటకు ఏ సౌకర్యము లేదు. ఒకవేళ జనకుడు రావణునికి ఆహ్వానము పంపాడనినా, దానిని తీసుకొని సముద్రము దాటిపోయి ఇచ్చువారు ఎవరూ లేరు. జనకుడు ఆహ్వానము పంపకున్నా పిలువని పేరంటానికి వచ్చినట్లు రావణుడే సీత స్వయం వరమును తెలుసుకొని వచ్చాడని కొందరు చెప్పుచుందురు. రావణుడు సీతను పెళ్ళి ఆడేదానికి సీత మీద వ్యామోహముతో వచ్చాడని కూడా కొందరు చెప్పుచుందురు. అలా వచ్చినవాడు స్వయంవరములో సీత ఎత్తగలిగిన శివధనస్సును ఎత్తలేక ధనస్సును మీదవేసుకొని అవమానము పాలయ్యాడని కొందరు రచయితలు రామాయణములో చెప్పియున్నారు. అయితే రచయితలు సత్యమును వ్రాశారా? అసత్యమును వ్రాశారా?యని

కొంత విచక్షణ బుద్ధితో చూస్తే రావణుడు శివధనస్సును ఎత్తలేకపోయాడని చెప్పడము పూర్తి అసత్యముగా తెలియుచున్నది. రావణుడు శివధనస్సును ఎత్తలేకపోయాడనుట పూర్తి అసత్యము అనుటకు రెండు ఆధారములు కలవు. సీత స్వయంవరమునకు ముందు అనగా దాదాపు కొన్ని సంవత్సరముల పూర్వము రావణుడు కైలాస పర్వతమునకు శివుని దర్శనార్థము పోయినప్పుడు కైలాస పర్వతమును ఎత్తి తన తలమీద పెట్టుకొన్నట్లు, అప్పుడు శివున్ని, శివధనస్సును ఎత్తినట్లు వ్రాసిన రచయితలు సీత స్వయం వరములో శివధనస్సును ఎత్తలేదు అనడము అసత్యమును వ్రాసినట్లు కాదా!? రెండవ ఆధారము ఏమనగా! సీత ఎత్తిన శివధనస్సును ఎత్తలేనివాడు సీతను ఎట్లు ఎత్తి తన విమానములో పెట్టాడు? అన్నది ప్రశ్న కాగలదు. సీతను ఎత్తుకుపోయాడు అన్నది సత్యమే అగుట వలన శివధనస్సును ఎత్తలేదు అనుట, రావణుడు పరాభవము చెందాడనుట అసత్యము. దీనినంతటినీ చూస్తే రావణున్ని చెడ్డవానిగా ప్రచారము చేయు నిమిత్తము సీత స్వయం వరములో రావణుని పాత్రను వ్రాశారు తప్ప, అది ఎంతమాత్రమూ సత్యము కాదని తెలిసిపోవుచున్నది.

రావణునికి పూర్తి చెడ్డ పేరు తెచ్చినది 'అడవిలో రాముడు లేని సమయములో సీతను రావణుడు తీసుకుపోయి లంకలో పెట్టాడు' అనునది. ఆ మాటకొస్తే అది జరిగినది వాస్తవమే. అయితే రావణుడు ఏ సందర్భములో అలా చేశాడు? ఏ వయస్సులో చేశాడు? ఎందుకోసము చేశాడు? అని ఆలోచించక జరిగిన కార్యమును చెడుగా ప్రచారము చేశారు. రావణుని మీద కోపముతో ఆనాటి రామాయణమును వ్రాసినవారు రావణుడు సీతను తీసుకపోవడమును పూర్తి చెడు చర్యగా చిత్రీకరించి వ్రాశారు. ఆనాడు రావణుడు, రాముడు నివశించు అడవికి వచ్చినది నిజమే అయినా, రావణుడు మారువేషములో రాలేదు. రావణుడు

రావణునిగానే వచ్చాడు. తాను రావణబ్రహ్మనని సీతకు తెలియజేశాడు. సీతను తన పుత్రికవలె లంకకు ఆహ్వానించాడు. తర్వాత రాముడు కూడా లంకకు వస్తాడని చెప్పి, సీతను ఒప్పించి లంకకు తీసుకువెళ్లాడు. సీత ఎత్తులోయున్న విమానమును ఎక్కలేదని ఆమెను తాకకుండా ఆమె నిలుచున్న మట్టిగడ్డతో సహా ఎత్తి తన విమానములో పెట్టాడు. అక్కడ నుండి నేరుగా లంకకు పోయాడు. లంకలో సీతకు ఏ బాధలేనట్లు అన్ని సౌకర్యములున్న అశోకవనములో పెట్టాడు. సీతకు సేవలు చేయు నిమిత్తము దాదాపు 20 మంది స్త్రీలను ఆమె దగ్గరయుంచాడు. తన నగరమునకు దాదాపు ఎనిమిది కిలోమీటర్ల దూరములో యున్న అశోకవనమునకు పదిరోజులకు ఒకమారు సతీసమేతముగా పోయి వచ్చేవాడు. అక్కడికి పోయిన రావణుడు తండ్రివలె సీతను పలకరించేవాడు. రావణుని భార్య మండోధరి దేవి తనభర్త సీతను అడవిలో చూడలేక, అక్కడ ఆమె పడే కష్టములను చూడలేక కొంతకాలమైనా తన సమక్షములో సుఖముగా ఉండవలెనని లంకకు తెచ్చినట్లు చెప్పేది. కన్నకూతురును పలుకరించినట్లు పలుకరించి అక్కడున్న సేవకురాండ్రకు సీతకు ఏ లోటు లేకుండా, ఎటువంటి అసౌకర్యము కలుగకుండా చూడమని చెప్పి వచ్చేవారు. అంతవరకు అడవిలో దొరికిన కాయలు, దుంపలు తిన్న సీత, కొన్ని సమయములలో కాయలుగానీ, భూమిలో దొరికే దుంపలు గానీ దొరకని దినములలో ఎన్నో పూటలు పస్తులు గడిపిన సీత, రావణుని ఆధ్వర్యములో లంకయందు కడుపునిండా రుచికరమైన ఆహారము తినేది. రావణుని వద్దయున్న పది నెలల కాలము సీత ఏ కష్టమునకు గురికాలేదు. పుట్టినింటిలోలాగ ఉండేది.

**ప్రశ్న :- మీరు చెప్పే విషయము ఇంతవరకు ఎవరూ చెప్పలేదు. మీరు చెప్పే విషయము కొంతవరకు సత్యముగానే కనిపించుచున్నది. ఇంతకు**

**ముందు మేము విన్నదియంతా అసత్యమేయని తోచుచున్నది. అయినా ఒక ప్రశ్నను మేము అడుగక తప్పదు. రావణుడు, రాముడు లేని సమయములో సీతను తీసుకుపోవడము ఎందుకు?**

**జవాబు :-** రామున్ని తమ లంకకు సీతను పంపమని అడిగితే రాముడు సీతను పంపడు అను ఉద్దేశ్యముతో రామునికి చెప్పకుండా రావణుడు సీతను లంకకు తీసుకుపోయాడు.

**ప్రశ్న :- సీత మీద కామగుణముతో, సీతను అనుభవించాలను చెడు బుద్ధితో, రావణుడు దొంగగా వచ్చి బలవంతముగా సీతను తీసుకుపోయాడని అందరూ అంటున్నారు. రామాయణ చరిత్రలో కూడా అలాగే వ్రాశారు. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** అడిగే ప్రశ్న ఎలాగయినా ఉండవచ్చును. చెప్పే జవాబు సక్రమముగా ఉండవలెననునది నా ఉద్దేశ్యము. ఎవరి చింత వారిది అన్నట్లు వారు ప్రశ్నను అడుగవచ్చును దానికి నేను సమాధానమును చెప్పుచున్నాను. ఆనాడు రామాయణ చరిత్రను వ్రాసిన రచయితలు ముందే ఒక నిర్ణయముతో ఉండి రామాయణమును వ్రాయడము జరిగినది. రావణున్ని చెడుగా చిత్రించి, ప్రజలలో దుర్మార్గునిగా చూపవలెనను నిర్ణయముతో సత్యమును అసత్యముగా వక్రీకరించి వ్రాసినదే రామాయణము. రామాయణము అను పేరులోనే ఆ విషయము కనిపించుచున్నది. **రామ అనగా అయోధ్య రాముడు అనియు, ఆయనము అనగా ఒక ప్రక్కయని చెప్పవచ్చును. రామ+ఆయనము=రామాయణము అనగా రాముని వైపు చెప్పినదని అర్థము.** అనగా రామున్ని మంచిగా, రాముని ప్రక్క చెప్పినదని అర్థము. రామున్ని మంచిగా చెప్పితే రామునితో యుద్ధము చేసిన రావణున్ని గురించి చెడుగా చెప్పారు.

సీతమీద చెడు ఉద్దేశ్యముతో ఆమెను అనుభవించాలని లంకకు సీతను తీసుకువెళ్లాడని చెప్పడము పూర్తి అసత్యము అని చెప్పక తప్పదు. ఎందుకనగా! సీతను రావణుడు తీసుకుపోయినప్పుడు రావణుని వయస్సు దాదాపు 99 సంవత్సరములు. ఆ వయస్సులో ఆయనకు చెడు బుద్ధి, కామగుణము ఉన్నదని చెప్పుకోవడము పూర్తి అసత్యము. చెప్పేవారు ఎలా అయినా చెప్పవచ్చును. వినేవారికి విచక్షణ ఉండవలెను. రావణుడు మహా బలశాలి అయినందున సీత ఎత్తయిన పుష్పక విమానమును ఎక్కలేకపోతే, సీతకు అసౌకర్యము కలుగకుండా మట్టిగడ్డతో సహా విమానములో పెట్టాడు. దానిని కూడా చెడుగా చిత్రించి సీతను ముట్టుకుంటే రావణుడు చనిపోతాడనీ, కాలిపోతాడనీ ఆమెను ముట్టుకోకుండా మట్టి గడ్డతో సహా ఎత్తుకపోయాడని చెప్పుచుందురు. రావణుడు సీతను ముట్టుకుంటే కాలిపోయేటప్పుడు, సీతను అనుభవించాలని ఎలా తీసుక పోతాడు? అన్న ప్రశ్నకు ఎవరూ జవాబు చెప్పలేరు. రావణుడు సీతను లంకకు తీసుకవస్తానని తన భార్యయైన మండోదరి దేవికి ముందే చెప్పి వచ్చాడు. తన చావు రాముని చేతిలో జరుగాలని, తన మరణము ఖచ్చితముగా 100 సంవత్సరములకు లంకలోనే జరుగుననీ, తాను సామాన్య మానవుడేయని అందరూ తెలియునట్లు, రాముని చేతిలో తన మరణము జరుగునని ముందే తన భార్యకు చెప్పాడు. రావణుడు తన చేతిలో చస్తాడని రామునికి తెలియదుగానీ, రాముని చేతిలో చస్తానని ముందే రావణునికి తెలుసు. అంతేకాక తన రావణ జన్మ తర్వాత వచ్చు మిగతా రెండు జన్మలు రక్తపాతముతోనే చనిపోవలసియున్నది. అందువలన తన మొదటి జన్మ అయిన రావణ జన్మ రక్తపాతముతోనే జరుగగా, దానిని అనుసరించి దానివలె ఆయుధముల వలననే రక్తపాతము జరిగి మిగతా రెండు జన్మలు మరణము పొందవలసి యున్నది. అందువలన రాముని చేతి బాణము

గ్రుచ్చుకొని, రక్తము బయటికి రావడము వలన చనిపోతానని త్రికాల జ్ఞాని అయిన రావణుడు జరుగబోవు సమాచారమును ముందే తన భార్యకు చెప్పాడు.

**ప్రశ్న :- ఈ విషయము రామాయణములో ఎక్కడా వ్రాయలేదే?**

**జవాబు :-** రావణున్ని చెడుగా చెప్పడమే రామాయణ (రాముని వైపు) ఉద్దేశ్యముకాగా జరిగిన సత్యమును ఎందుకు చెప్పుదురు? సత్యమును కూడా అసత్యముగా చెప్పడమే రామాయణము. అందులో రావణాయణము కొంతయినా లేదు. అందువలన రావణున్ని గురించి చెప్పిన అసత్యములే అందులో గలవు. బాగా అర్థము కావాలంటే రామాయణమును గురించి మరొకమారు చెప్పెదను వినుము. ఉత్తరాయణము, దక్షిణాయణములాగా రామాయణము గలదు. 'ఆయణము' అనగా 'ఒక ప్రక్కయని' అర్థము చెప్పుకొన్నాము. ఉత్తరాయణము అనగా ఉత్తరము ప్రక్కయనీ, దక్షిణాయణము అనగా దక్షిణము ప్రక్కయనీ చెప్పవచ్చును. సూర్యుడు ఉత్తరము వైపు యున్నప్పుడు ఉత్తరాయణము అనియూ, సూర్యుడు దక్షిణము వైపు యున్నప్పుడు దక్షిణాయణము అనియూ చెప్పినట్లు, రచయిత రాముని వైపు ఉన్నవాడై రామున్ని మంచిగా చెప్పుచూ, రాముని ప్రక్కనే గ్రంథము ప్రశంసించినట్లు చెప్పడమును 'రామాయణము' అని చెప్పక తప్పదు. రామాయణములో ఒకవైపు ప్రశంస తప్ప ఇరువైపులా సమానముగా ఉన్నది ఉన్నట్లు వ్రాయలేదు. రావణుడు ఎన్నో గొప్ప పనులు చేసినా అవి అన్నియూ చెడు పనులుగా వక్రించి, రాముడు చేసిన పనులు మాత్రము ప్రశంసించి వ్రాయడమును రేపు ఎవరయినా తప్పు పట్టుదురని ముందే మేము రాముని వైపే వ్రాశాము అన్నట్లు గ్రంథము పేరు 'రామాయణము'గా పెట్టారు. ఇంతవరకూ రామాయణ గ్రంథము పేరులో ఇంత రహస్యమున్నట్లు

ఎవరికీ తెలియదు. రావణుడు ఏ మంచి పని చేసినా అది చెడుగా, అలాగే రాముడు ఏ చెడు పని చేసినా దానిని మంచిగా వర్ణించి చెప్పినదే రామాయణము.

సూర్యునికి ఉత్తరము, దక్షిణము రెండూ సమానమే. అందువలన ఉత్తరాయణములో కొంతకాలమూ, తర్వాత దక్షిణాయణములో కొంత కాలము ఉంటున్నాడు. సూర్యుడు ఉత్తరాయణములో ఉన్నప్పుడు దక్షిణము చెడుదని చెప్పలేదు. దక్షిణము వైపు పోకుండా ఉండలేదు. అలాగే రాముని వైపు గ్రంథకర్త చెప్పినప్పుడు రాముని గురించిన మంచి విషయములు మాత్రమే చెప్పక రావణుని చెడు విషయములను చెప్పడము వలన రామాయణము పక్షపాత వైఖరితో వ్రాసినది తప్ప ఉన్నదున్నట్లు వ్రాయలేదు. రామున్ని దేవునిగా వర్ణించి చెప్పారు. దానికి ఎవరూ కాదనలేరు. అంతటితో ఆగక రావణున్ని రాక్షసునిగా వర్ణించి చెప్పారు. రావణున్ని గురించి అలా చెప్పవలసిన అవసరము లేదు, అయినా రావణున్ని చెడుగా, రామున్ని మంచిగా చెప్పుట వలన ఒకవైపు ప్రశంస తప్ప ఇతరము లేనందున గ్రంథము పేరు రామాయణముగా చెప్పారు. మేము రామున్ని చెడుగా చెప్పకుండా అందరూ రామున్ని దేవుడనుటను కాదనకుండా, రావణున్ని గురించి మాత్రము వ్రాయుచున్నాము. సత్యాసత్యములను తెలుపు నిమిత్తము ఈ గ్రంథమును వ్రాయుచున్నాము. కావున ఇతరులకు తెలియని ఎన్నో విషయములను మేము చెప్పవలసి వచ్చినది. రావణుడు తన మరణమును గురించి ముందే తెలియజేశాడు. అంతేగాక తన ఆయుష్షు వంద సంవత్సరములని కూడా చెప్పాడు. ఇవి ఎవరికీ తెలియని విషయములే. అందువలన నేను ఆ విషయములను బయటపెట్టవలసి వచ్చినది. ఎవరికీ తెలియని విషయములుంటేనే నేను గ్రంథము వ్రాస్తానుగానీ, తెలిసిన

విషయములుంటే నేను ప్రత్యేకించి రావణున్ని గురించి గ్రంథము వ్రాయవలసిన అవసరము లేదు. నా చేత వ్రాయబడిన ప్రతీ గ్రంథము కొంత ప్రత్యేకత కల్గి, ఎవరికీ తెలియని క్రొత్త విషయములను చెప్పుచుండును. అందువలన సీత విషయములోగానీ, రావణుని విషయములో గానీ ఇంతవరకూ ఎవరికీ తెలియని క్రొత్త కోణములను తెలియజేయుచున్నాను. ఆ పద్ధతి ప్రకారము **"రావణుని మరణము"** పూర్తి ప్రత్యేకతను కల్గియున్నది. రావణుడు త్రేతాయుగములోనే కాక ద్వాపర యుగములోను, కలియుగము లోను పుట్టవలసి యున్నది. అలా పుట్టునప్పుడు కూడా ఆయన మరణము ద్వాపర, కలియుగములలో కూడా ప్రత్యేకత కల్గియున్నది. రావణుడు తర్వాత పుట్టునని చెప్పడము అందరికీ క్రొత్తగా, కనువిప్పుగా యున్నా మామాట నూటికి నూరుపాళ్లు సత్యము.

**ప్రశ్న :- రాముడు దేవుడు కావున ఆయన తర్వాత యుగములలో అవతరించ వచ్చును. గానీ రావణుడు తర్వాత అవతరించాడు అనడము మాకు అసత్యముగా కనిపించుచున్నది. రాముడు తర్వాత జన్మలో కృష్ణుడుగా పుట్టాడు అని అందరూ చెప్పుచుందురు. ద్వాపర యుగములో కృష్ణునిగా పుట్టిన రాముడు, కలియుగములో కల్కి భగవానునిగా పుట్టునని పురాణాలలో చెప్పియున్నారు. విష్ణువు యొక్క దశావతారములలో రాముడు, కృష్ణుడు, కల్కి అని పురాణాలలో చెప్పడము కలదు. అందువలన రాముడు ద్వాపర యుగములో కృష్ణునిగా పుట్టాడనీ, కలియుగములో కల్కిగా పుట్టునని మేము విన్నాము. అంతేగానీ రావణుడు ద్వాపర, కలియుగములలో పుట్టునని మీరు తప్ప ఎవరూ చెప్పలేదు. ఏ గ్రంథములోనూ వ్రాయలేదు. మీ మాటను మేము ఎలా నమ్మాలి?**

**జవాబు :-** నేను నా మాటను నమ్మాలియని ఎక్కడా చెప్పలేదు. ఎవరు

నమ్మినా, నమ్మకపోయినా సత్యమును తెలుపుదునని చెప్పుచూ జరిగిన సత్యమును తెలియజేశాను. గతములో కూడా ఎవరి ఊహకు అందని కొన్ని దైవరహస్యములను కూడా తెలియజేయడము జరిగినది. మా రచనలలోని **"కృష్ణమూస"** గ్రంథములో ఎన్నో బ్రహ్మరహస్యములను తెలియ జేసాము. మీరు విష్ణువు యొక్క దశావతారములను తెలియజేశారు. నేను దేవుని యొక్క అవతారములను గురించి తెలియజేయుచున్నాను. దేవునికి ఎన్ని అవతారములో ముందు చెప్పుటకు వీలులేదు. ఎందుకనగా! దేవుడు భూమిమీద ధర్మములకు ముప్పు ఏర్పడినప్పుడు అవతరిస్తాడు. అందువలన దేవునికి ఇన్ని అవతారములని చెప్పలేము.

**ప్రశ్న :- రావణుడు తన చెల్లెలు సూర్పనకకు ముక్కు, చెవులు కోసి, అవమానించినందుకు ప్రతీకారముగా సీతను రావణుడు లంకకు తీసుక పోయాడని కొందరు చెప్పుచుందురు. ఆ మాట సత్యము కాదా?**

**జవాబు :-** రావణుడు సీతను లంకకు తీసుకపోయినప్పుడు ఆయన వయస్సు 99 సంవత్సరములున్నాయి. దానికంటే మూడు నెలలు ముందు రావణుని చెల్లెలుకు ముక్కు చెవులు కోసినట్లు చెప్పవచ్చును. అప్పటికి సూర్పనక వయస్సు రావణునికంటే రెండు లేక మూడు సంవత్సరములు తక్కువ ఉంటుంది. ఆ లెక్కప్రకారము ఆమె వయస్సు దాదాపు 96 సంవత్సరములు ఉండవచ్చును. ఆ వయస్సులో ఆమె పూర్తి ముసలమ్మ మాదిరి ఉండును కదా! ఆమె పోయి రామున్ని ప్రేమించినదని చెప్పడము అభూత కల్పన కాదా! రావణున్ని తప్పుగా చూపుటకు అల్లిన అబద్దపు సమాచారము అని ఆలోచించు ప్రతివారికి తెలియును. రాముని వయస్సు దాదాపు 30 సంవత్సరములు ఉన్నప్పుడు రావణబ్రహ్మ సీతను లంకకు తేవడము జరిగినది. దానికంటే మూడు నెలల ముందు సూర్పనకకు ముక్కుచెవులు కోశారని చెప్పుచున్నారు. దీనిప్రకారము 96 సంవత్సరముల ముసలామె

30 సంవత్సరముల రామున్ని ప్రేమించినదంటే ఆశ్చర్యము కాదా! జరగని సంఘటనను జరిగినట్లు చిత్రించి చెప్పినదే కానీ ఇందులో వాస్తవము లేదని తెలియవలెను.

**ప్రశ్న :- మారీచుడు బంగారు లేడి రూపములో వచ్చాడని చెప్పుట వాస్తవము కాదా?**

**జవాబు :-** ఇందులో కూడా ఏమాత్రము వాస్తవము లేదు. జరిగిన వాస్తవము ఏమనగా! రావణుడు సీతను లంకకు తెచ్చినప్పుడు రాముడు లక్ష్మణుడు ఇద్దరు అక్కడ లేరనుట వాస్తవము. వారి కుటీర ప్రాంతములో జింక కనిపించగా, దానిని వేటాడుటకు రాముడు లక్ష్మణుడు ఇద్దరు కలిసి పోయారు. జింకను తరుముచూ పోగా అడవిలో దూరముగా జింక పారిపోయింది. చివరకు ఎలాగో జింకను చంపి తమ నివాసమునకు రాముడు లక్ష్మణుడు తేవడము జరిగినది. జింక కోసము వారు అడవిలోనికి పోయి మూడు గంటలు గడచిన తర్వాత వచ్చారు. అంతలో సీత అక్కడ లేదని వారికి తెలిసినది. వారు జింకను వేటాడుటకు పోయిన మాట వాస్తవమేగానీ రాముడు ఒక్కడు బంగారు జింక కొరకు పోయాడనీ, బంగారు జింకను సీత అడిగిందని చెప్పడము పూర్తి అసత్యము. బంగారు జింక ఉందని నమ్మడము మన తెలివితక్కువ పని యగును.

భూమిమీద ఎక్కడా బంగారు జింకలు లేవు. ఆనాడు మారీచుడు బంగారు జింకగా వచ్చాడు అనడము పూర్తి అసత్యము. మనుషులు జింకగా రూపము మార్చుకొనుట అసంభవము. ఆ మాట కల్పితము చేసి వ్రాసినది తప్ప సత్యము కాదని తెలియవలెను. రాముడు బంగారు జింక కొరకు అడవిలోనికి పోయి "లక్ష్మణా!" అని అరిస్తే సీతకు లక్ష్మణునకు వినిపించినదని చెప్పినప్పుడు రాముడు అరిస్తే వినిపించు దూరములోనే ఉన్నాడు కదా! అటువంటప్పుడు సీత ఆపదలలో అరిస్తే రామునికి కూడా వినిపించవలెను

కదా! అంతేకాక అరిస్తే వినిపించు దగ్గరలో యున్నవారు వచ్చే లోపలే సీతను అపహరించుటకు సాధ్యమగునా? కూతవేటు దూరములో యున్న వారికి పుష్పక విమానము వచ్చి దిగేది సమీపములోయున్న వారికి కనిపించును కదా! పుష్పక విమానము చిన్న గంపలాంటిదో, చెంబులాంటిదో కాదు కదా! అంతపెద్ద విమానము వచ్చునప్పుడు గానీ, పోవునప్పుడుగానీ అరిస్తే వినిపించు దూరములో యున్నవారికి కనిపించకుండునా?

ఆనాడు వారికి అడవిలో దొరుకు అన్ని ఆహార పదార్థములు తినే అలవాటుండేది. ప్రతి రోజు వారికి పండ్లు, తేనె దొరకదు కదా! అందువలన అడవిలో దొరుకు మాంసమును కూడా తినే అలవాటు వారికి ఉండేది. ఆ అలవాటు ప్రకారము ప్రతిరోజు అడవిలోనికి పోయి, వేటాడి దొరికిన వాటిని తెచ్చుకొని తినేవారు. దానిప్రకారమే వారు కనిపించిన జింక కొరకు పోయారు తప్ప, బంగారు జింక కొరకు పోలేదు. బంగారు జింక కనపడిందియని చెప్పుట పూర్తి అసత్యము. ఇది అల్లిన కథ తప్ప జరిగిన సంఘటన కాదని తెలియవలెను.

**ప్రశ్న :- సీత మీద మోహపు చూపుతోనే ఆమెను రావణుడు అపహరించుటకు పోయాడు అని కొందరు అనుట అసత్యమా?**

**జవాబు :-** అంతకుముందు జరిగిన చరిత్ర తెలిస్తే ఆ విధముగా ఎవరూ మాట్లాడరు. గతములో లంకలోనే సీత పుట్టింది. సీత చిన్న వయస్సులో శిశువుగా యున్నప్పుడు పుట్టిన కొన్ని గంటలకే రావణబ్రహ్మకు సీత శిశువుగా దొరికినది. అప్పుడు కొన్ని నెలలు మాత్రము సంరక్షించిన రావణుడు తన శిష్యుడయిన జనకునికి సీతను ఇవ్వడము జరిగినది. సంతతి లేని జనకుడు సీతను దత్తతిగా తన గురువైన రావణుని వద్దనుండి తీసుకోవడము జరిగినది. సీత పెరిగి పెద్దదయిన తర్వాత ఆమెకు కూడా ఈ విషయమంతా తెలుసు. రావణబ్రహ్మ తనకు మొదటి తండ్రికాగా,

జనకుడు రెండవ తండ్రియని తెలుసు. సీత అడవిలోనుండగా 'కూతురు ప్రేమతో ఆమెను రావణుడు తెచ్చాడు' అని ఎవరికీ తెలియకుండా కవులు చరిత్రను వక్రీకరించి వ్రాశారు. రామునికి చెప్పకుండా సీతను తీసుక పోవడము వలన రాముడు తనమీదికి యుద్ధమునకు వచ్చునని, అలా యుద్ధము జరుగవలెనని ముందే తెలిసిన రావణబ్రహ్మ తన చావును గురించి తెలిసినవాడై అలా చేశాడు. ఆ విషయము తెలియనివారు ఆయనను దుర్మార్గునిగా భావించారు. జరిగిన సత్యము తెలిస్తే రావణునికి రాముడు అల్లుడు కాదా! సీత బిడ్డ అయినప్పుడు రాముడు అల్లుడేయగును. అయినా ఆ విషయము ఎవరికీ తెలియదు. రావణుడు సీతను కూతురు ప్రేమతో లంకకు తెచ్చాడుగానీ ఇతర ఉద్దేశ్యము ఏమీ లేదని చెప్పవచ్చును.

**ప్రశ్న :- మీరు రావణున్ని దేవునితో సమానముగా చెప్పుచున్నారు కదా! రాముడు లంకకు వచ్చినప్పుడు ఆయన సీతను రామునికి అప్పజెప్పక రామునితో యుద్ధము ఎందుకు చేశాడు?**

**జవాబు :-** సీత కొరకు రాముడు లంకకు రావలెనని, తనతో యుద్ధము చేయవలెననీ, ఆ యుద్ధములో తాను చనిపోవుదుననీ ముందే భవిష్యత్తును రావణుడు చెప్పాడు. త్రికాల జ్ఞాని అయిన రావణుడు పెద్ద జ్యోతిష్యుడు. ఆయనను మించిన జ్యోతిష్యుడు లేడు. అందువలన సీతను సాకుగా చూపి ఏదో ఒక కారణముతో రామునితో యుద్ధము చేశాడు. రాముని చేతిలో చనిపోయినట్లు లోకమునకు తెలియునట్లు చేశాడు. రావణుడు రాముని చేతిలో చనిపోవడము వలన రాముడే గొప్పయనీ, రావణుడు తక్కువయనీ ప్రజలకు తెలిసినది. రావణుడు తనను గురించి తక్కువ జేసుకొని రాముని చేతిలో మరణించుట రామాయణమునకు పెద్ద అవకాశము దొరికినది. దానితో రావణున్ని దుర్మార్గునిగా చిత్రించారు.

**ప్రశ్న :- సీతను రామునికి అప్పజెప్పక సీత కొరకు యుద్ధమునకు పూనుకోవడము దుర్మార్గము కాదా?**

**జవాబు :-** రాముడు భర్తయినందున రావణ యుద్ధము తర్వాత సీత రాముని వెంటవచ్చినది. రామున్ని గురించి సీత ఏమాత్రమూ అనుమానపడలేదు. అయితే రాముడు సీతను అనుమానించి అగ్నిపరీక్ష చేయించాడు. సీతను అగ్నిపరీక్షకు గురిచేసినప్పుడు తన భర్తకు తనమీద నమ్మకము లేదు కదాయని సీత ఎంతో బాధపడినది. తనను కూతురుగా ఎటువంటి లోటు లేకుండా చూచుకొన్న రావణుడు చనిపోవడము వలన సీత చాలా బాధపడి తప్పనిసరిగా రామునివెంట వచ్చినది. అలా రాముని వెంట వచ్చిన సీత రావణుడు చెడ్డవాడని ఒక్కమాట కూడా చెప్పలేదు. రాముడు తనను శీల పరీక్ష చేయడము వలన రాముడు స్వంత భార్యను నమ్మని అనుమానమున్న వాడని చెడుగా తనలో తాను అనుకోవడము జరిగినది. రావణుడు సీత కొరకు యుద్ధము చేశాడనుటకంటే 'తన మరణము కొరకు' రామునితో యుద్ధము చేశాడు అనుట మంచిది. నూరు సంవత్సరములకు రాముని చేత చంపబడవలెనని ముందే నిర్ణయము చేయబడినది. ఆ నిర్ణయము నెరవేరుటకు సీతను సాకుగా చూపి యుద్ధము చేశాడు తప్ప, సీత కొరకు యుద్ధము చేయలేదు. నూరు సంవత్సరముల వయస్సులో సీత కొరకు యుద్ధము చేశాడని చెప్పడము పూర్తి అసత్యము. రావణుని వయస్సును బట్టి సీత కొరకు యుద్ధము చేశాడు అనుట అనుచితము. 'తన మరణము కొరకు యుద్ధము చేశాడు' అనుట సత్యము. ఇది ప్రజలకు తెలియని సత్యము అగుట వలన రావణుడు సీత మీద వ్యామోహముతో, సీత కొరకు యుద్ధము చేశాడని అనుకొన్నారు. రామాయణమును వ్రాసిన వారు ఈ విషయమును బాగా ఉపయోగించుకొని రావణుని పూర్తి చెడుగా చిత్రించారు.

**ప్రశ్న :- నూరు సంవత్సరములకు మరణమున్నదని భవిష్యత్తు తెలిసిన రావణుడు మిగతా కారణములు కలుగజేసుకొని, మిగతా వారి చేతిలో చనిపోవచ్చును కదా! రాముని చేతిలోనే ఎందుకు చనిపోవాలి? ఇతరులతో ఏదో ఒక కారణము చేత యుద్ధము చేసి ఇతరుల చేతిలో చనిపోవచ్చును. తన చావు కొరకు సీతను ఎందుకు తెచ్చుకోవాలి? చివరకు రాముని చేతిలోనే ఎందుకు చావాలి? దీనికి జవాబు చెప్పగలరా?**

**జవాబు :-** మీరు అడిగే ప్రతీ ప్రశ్నకు జవాబును చెప్పగలను. రాముని చేతిలోనే రావణుడు చనిపోవుటకు బలమైన కారణము గలదు. రావణుడు మొదట ఎలా చనిపోతే మిగతా రెండు జన్మలలో అలాగే చనిపోవాలియను నియమము కలదు. మొదట రావణుడు రక్తపాతముతోనే చనిపోవాలని ఉండుట వలన తర్వాత రెండు జన్మలలో రక్తపాతముతోనే చనిపోవలసి యున్నది. అదే విధముగా రావణుడు మొదట ఎవరి చేతిలో చస్తే రెండవ జన్మలలో కూడా అతని చేతిలోనే చనిపోవలసియుండును. ఇదంతయూ ముందే నిర్ణయము చేయబడిన అనుబంధ విధానము. రాముడు రావణున్ని చంపుట వలన తర్వాత రెండవ జన్మలోనూ రాముడే రావుణున్ని చంపవలసి యుంటుంది. రాముడు త్రేతాయుగములో రావణున్ని చంపుట వలన రెండవ ద్వాపర యుగములో కూడా రాముడే రావణున్ని చంపవలసి యుంటుంది. త్రేతాయుగములో రాముడు బాణముతో రావణున్ని చంపుట వలన ద్వాపర యుగములో కూడా రాముడు బాణముతోనే రావణున్ని చంపవలసియుండును. అయితే రాముడు, రావణుడు ఇద్దరూ ద్వాపర యుగములో వేరువేరు పేర్లతో పుట్టుట వలన త్రేతాయుగములో జరిగిన సంఘటనకు, ద్వాపర యుగములో జరిగిన సంఘటనకు ఎటువంటి పోలికలు లేనందున రాముడు, రావణుడు ద్వాపర యుగములో పుట్టారని ఎవరికీ తెలియదు. రాముడు ద్వాపర యుగములో కృష్ణునిగా పుట్టాడని

కొందరు చెప్పుట వలన రాముడు ద్వాపర యుగములో పుట్టాడు అని కొందరు నమ్మవచ్చును. అయితే అప్పుడు జరిగిన విషయము గురించి సవివరముగా ఎవరికీ తెలియదు. ఆ తెలియని విషయమును నేను తప్ప చెప్పువారు ఎవరూ లేరు. ఎందుకనగా! త్రేతాయుగములోను నేను యున్నాను, అట్లే ద్వాపర యుగములోను నేను యున్నాను. మీరు కూడా రెండు యుగములలోనూ ఉండడమేకాక ఇప్పుడు కలియుగములో కూడా యున్నారు. అయితే వెనుకల జన్మలలో ఏమి జరిగినది తెలియని స్థితిలో యున్నారు. అందరిలాగా కాకుండా నాలో మాత్రము నా ఆత్మ అప్పుడు జరిగిన విషయములను జ్ఞాపకము చేయుట వలన త్రేతాయుగములోనూ, ద్వాపర యుగములోనూ జరిగిన విషయములను చెప్పగలుగుచున్నాను. త్రేతాయుగములోని రాముడు, ద్వాపర యుగములో ఎవరిగా పుట్టాడో? ఎలా తన బాణముతో రావణున్ని చంపాడో నాకు తెలుసు. అలాగే త్రేతాయుగములోని రావణుడు ద్వాపర యుగములో ఏ పేరుతో పుట్టాడో కూడా నాకు తెలుసు. రామునికి త్రేతాయుగములోని జ్ఞాపకము లేనందున ద్వాపర యుగములో పుట్టినా తాను త్రేతాయుగములో రామున్ని అని ఆయనకు తెలియదు. రావణునికి త్రేతాయుగములోని జ్ఞాపకము, ద్వాపర యుగములో కూడా ఉండుట వలన త్రేతాయుగములో నేను రావణునిగా ఉన్నానని ద్వాపర యుగములో కూడా ఆయనకు తెలుసు.

**ప్రశ్న :- అయితే మీరు రామున్ని దేవుడు కాదంటారా?**

**జవాబు :-** నీవు ఎవర్ని దేవుడు అనినా నేను కాదనను. అటువంటప్పుడు రామున్ని దేవుడు కాడు అని నేను ఎలా అనగలను. మనము అందరము రాముడు దేవుడు అనినా, రాముడు 'నేను దేవున్ని' అని ఒప్పుకోవాలి కదా! రాముడు 'నేనే దేవున్ని' అని తన జీవితములో ఒక్కమారు కూడా చెప్పలేదు.

దేవుడు అయినవాడు బయటికి చెప్పుకోడు. మనుషులమయిన మనమే రాముడు దేవుడు అని అంటున్నాము. అందరూ అంటున్నారు కాబట్టి నేను అంటున్నానని మిగతా ప్రజలు అంటున్నారు. రాముడు దేవుడా?యని నేను ఒక మనిషిని ప్రశ్నిస్తే దేవుడో కాదో నాకు తెలియదు. అందరూ “దేవుడు అన్నప్పుడు నేను అనకపోతే బాగుండదు” అని అన్నాడు. ఆనాడు త్రేతాయుగములోయున్న ప్రజలకు, రామున్ని చూచిన ప్రజలకు రాముడు దేవుడని తెలిసియుండవచ్చును. కానీ ఇప్పటి ప్రజలకు రామున్ని గురించి తెలియకపోయినా పెద్దలు బోధించిన బోధలను బట్టి రాముని మీద భక్తి కల్గి రామున్ని దేవుడని అంటున్నారు. చివరకు భక్తి లేనివాడు కూడా రాముడు దేవుడేయని అంటున్నాడు. అలా అనకపోతే ప్రక్క ప్రజలతో నాకు ఇబ్బందియని చెప్పుచున్నాడు.

**ప్రశ్న :- రాముడు దేవుడయిన దానివలన సీత కూడా రాముని ఎడల ఎంతో భక్తితో యుండేది. ప్రజలు కూడా భక్తిగా యుండేవారు. అందువలన రామరాజ్యము కావాలని నేడు అందరూ కోరుకొంటున్నారు. రావణ రాజ్యము కావాలని ఎవరూ కోరుకోరు. రాముడు దేవుడనుటకు ఇది నిరూపణ కాదా?**

**జవాబు :-** మాటి మాటికి రాముడు దేవుడు అని అంటున్నావు. ఆ మాటను మేము కాదనలేదుగానీ కొందరు ప్రజలు ఇలా అంటున్నారు. దానికి మీరు ఏమి జవాబు చెప్పగలరు? ఇది నా మాటకాదుగానీ కొందరి ప్రజల మాటను చెప్పుచున్నాను చూడండి. **రాముడు దేవుడే అయితే ఆనాడు రాముని రాజ్యములోని ఒక చాకలి రామున్ని సీత విషయములో ఎందుకు దూషించాడు? చాకలివాడు అన్న మాటను రాముడు దేవుడైయుండి ఎందుకు తీవ్రముగా పరిగణించాడు. అప్పుడు చాకలిని దండించక సీతను అడవిలో ఎందుకు వదిలిపెట్టాడు? పదహారు సంవత్సరములు సీత వియోగముతో ఎందుకు**

**బాధపడ్డాడు. చివరిలో రాముడు సీతను కలిసి తిరిగి తన వెంట అయోధ్యకు రమ్మనగా నీతో కాపురము చేయుటకంటే చచ్చేది మేలని పర్వతము మీది నుండి దూకి ఎందుకు ఆత్మహత్య చేసుకొన్నది? పది నెలల కాలము రావణుని సాన్నిధ్యములో సీతయున్నా ఎప్పుడుగానీ రావణుడు చెడ్డవాడని ఒక్కమాట కూడా చెప్పలేదు కదా! సీత లెక్కలో రాముడు మంచివాడా? రావణుడు మంచివాడా?యని అడుగుచున్నారు.** నేడు రామునికి వ్యతిరేఖ సంఘములు కూడా ఏర్పడి రామున్ని గురించి ప్రశ్నించుచున్నవి. అయినా ఆనాడు ఏమి జరిగిందో దానినే పరిగణలోనికి తీసుకోవాలిగానీ, ఎవరు ఏమి చెప్పితే దానివెంట పోకూడదు అన్నది నా వాదన.

**ప్రశ్న :- రాముడు దేవుడని రావణుడు ఆ రోజు తెలుసుకోకపోవడము వలన రావణుడు రాముని చేతిలో చనిపోయాడు. రాముడు దేవుడని రావణుడు ఎందుకు తెలియకపోయాడో? బహుశా అతనిలోని అజ్ఞానమే ఆ విధముగా రామున్ని దేవుడని గుర్తించలేకపోయింది అని మేము అంటున్నాము. దీనికి మీరు ఏమంటారు?**

**జవాబు :-** మీరు ఎంతసేపు యున్నా రామునివైపు మాట్లాడుచున్నారు. నేను సత్యవాదిని కనుక నేను రావణునివైపు మాట్లాడవలసి వచ్చినది. మీరు మాట్లాడునది రాముని ఆయణము, నేను మాట్లాడునది రావణాయణము. రామాయణము ప్రకారము రాముడు దేవుడే. అయితే రావణాయణము ప్రకారము చూస్తే రావణునికి పేరు చివరిలో బ్రహ్మ అని రెండక్షరములు గలవు. రామునికి అటువంటిది పేరు చివరిలో లేదు. బ్రహ్మయనగా పెద్దయని అర్థము. ప్రంపచములో ఏది పెద్దనో దానిని 'బ్రహ్మ' అనవలెను. బ్రహ్మయనగా అన్నిటికీ పెద్ద అయినవాడని అర్థము. 'అన్నిటికీ పెద్ద అయిన వాడు ఎవడు?' అని ఆలోచిస్తే ఈ ప్రపంచమును సృష్ఠించిన పరమాత్మకే ఆ పేరు వర్తిస్తుంది. రావణునికి ఆయన పేరు ప్రక్కలో బ్రహ్మయని కొందరు

జ్ఞానులు చెప్పగా వచ్చినది. కొందరు జ్ఞానములో సంపన్నులయిన వారు త్రేతాయుగములోనే రావణున్ని గుర్తించి, ఆయనను రావణ బ్రహ్మయని పేరు పెట్టారు. భూమిమీద దైవధర్మములు లేకుండాపోయి, అధర్మములు ఎక్కువయినప్పుడు బ్రహ్మ అనబడు (పెద్ద యనబడు) దేవుడు ఒక మనిషి ఆకారములో అవతరించి తన జ్ఞానమును తానే బోధించి ధర్మములను నెలకొల్పిపోవును. కృతయుగములో చెప్పబడిన దైవజ్ఞానము త్రేతాయుగము వచ్చినప్పటికి ప్రజల మధ్యలో లేకుండా పోయినది. అందువలన త్రేతా యుగములో దేవుడు అవతరించి, తన ధర్మములను జ్ఞానరూపములో బోధించి ధర్మములను నెలకొల్పాడు. అయినా ఆయన భూమిమీద యున్నప్పుడు ఆయనను ఎవరూ గుర్తించలేదు.

దేవుడు మనిషిగా వచ్చినప్పుడు తనను గుర్తించకుండా దేవుడు మనిషివలె ప్రవర్తించుచుండును. మనిషివలె ప్రవర్తించు దేవున్ని ప్రజలు చూచినప్పటికీ, మనిషివలెయున్న దేవుడు దైవజ్ఞానమును చెప్పినప్పటికీ, దేవుడు మనిషిగా యున్నప్పుడు ఆయనను ఏ విధముగా కూడా గుర్తించలేరు. దేవుడు జ్ఞానులు తనను గుర్తించుటకు అవకాశమిచ్చి, తన జ్ఞానమును చెప్పినా, చాలామంది జ్ఞానులు సహితము ఆయనను గుర్తించలేకపోయారు. దేవుడు మనిషి రూపములో దైవజ్ఞానమును చెప్పుట వలన, ఆయన భూమిమీద లేకుండా పోయిన తర్వాత, కొందరు జ్ఞానులు వచ్చిపోయిన వాడు సాధారణ మానవుడు కాదు, దేవుడే మనిషి రూపములో అవతరించాడు అని అనుకోవడము జరిగినది. దాని ప్రకారము కృష్ణుడు పోయాక కొందరు **"కృష్ణుడు మనిషి అవతారములో యున్న దేవుడని"** తెలియగలిగారు. అలా తెలిసి తాము తెలిసిన విషయమును బయటికి చెప్పితే అజ్ఞానులయిన వారు నమ్మకపోగా వారే కృష్ణున్ని చెడుగా చెప్పుచూ జారుడు, చోరుడు యని అన్నారు. ఈ విధముగా నాకు తెలిసిన దేవుని మూడు జన్మలు

బహు అరుదుగా కొందరు జ్ఞానులయినవారు గుర్తించగా, చాలామంది ప్రజలు దేవుని అవతారమును విశ్వసించలేదు. వచ్చినవానిని దేవుడని ఒప్పుకోకపోగా, అతనిని దుర్మార్గునిగా చిత్రించి, దేవుని స్థానములోనికి దేవుడు కానివానిని తెచ్చి, ఇతనే దేవుడని ప్రచారము చేయడము కూడా జరిగినది.

**ప్రశ్న :- రాముడు భూమిమీద యున్నప్పుడు రామున్ని దేవునిగా చాలామంది చెప్పుచున్నా రావణుడు రామున్ని దేవుడని విశ్వసించలేకపోయాడు. దానిని బట్టి దేవుడు మనిషిగా వచ్చినప్పుడు కొందరు ఈయనే దేవుడని రామున్ని చూపినా, రావణుడు అజ్ఞాని కాబట్టి రామున్ని దేవుడని నమ్మలేకపోయాడని తెలియుచున్నది. రామున్ని రావణుడు దేవుడని ఒప్పుకోకపోవడము వలన రావణుడు పూర్తి అజ్ఞానియని మీరు ఒప్పుకోగలరా?**

**జవాబు :-** ప్రజలందరూ రామున్ని దేవుడనినా, చివరకు నలుగురుతో పాటు మేము కూడా రాముడు దేవుడేయని ఒప్పుకొనినా, రావణుడు మాత్రము రామున్ని దేవుడని ఒప్పుకోలేదు. అంతమాత్రమున రావణున్ని అజ్ఞాని అనుటకు వీలులేదు. రావణునికి రాముడు దేవుడని, ఆయనతో యుద్ధము వద్దని కూడా చెప్పారు. అయినా రావణుడు తనకు దగ్గరున్నవారు ఆ మాటను చెప్పినా వారి మాటను కూడా వినకపోవడానికి, రాముడు దేవుడని ఒప్పుకోకపోవడానికి బలమైన కారణము కలదు. అది ఏమనగా! తానే స్వయముగా దేవుడైయుండి, మానవ అవతారములో వచ్చిన విషయము తనకు జ్ఞాపకముండగా ఇంకొకరిని దేవుడని అనుకొనుటకు అవకాశమే లేదు. అందువలన రాముని విషయములో రావణుడు మౌనముగా ఉండిపోయాడు.

**ప్రశ్న :- ఏమిటి? నీవు రావణున్ని దేవుడని అంటావా?**

**జవాబు :-** నా స్వతహాగా రావణున్ని దేవుడని నేను అనకున్నా, శాస్త్రముల ఆధారములు రావణున్ని దేవుడని తెలుపుచున్నాయి. దేవతలు ఎందరో రావణున్ని దేవుడుగా తెలిసినవారై, రావణునికి నమస్కరించారు. అంతేకాక రావణుని పేరు చివరిలో **"బ్రహ్మ"** అను పదమును చేర్చి **'రావణబ్రహ్మ'**యని అన్నారు. బ్రహ్మ యనగా అన్నిటికీ, అందరికీ పెద్దయిన దేవుడని ముందే చెప్పుకొన్నాము. 'బ్రహ్మ' అను పేరు మనిషిగాయున్న వానికి రావడము ఎక్కడా జరుగలేదు. అది రావణునికి ఒక్కనికే దక్కినది. ఆయన తర్వాత బ్రహ్మయని ఎవరి పేరు చివరిలో చెప్పబడలేదు. 'బ్రహ్మ' అను పదము రావణునికి ఒక్కనికే ఉండడము గమనించదగ్గ విషయము. 'బ్రహ్మ' అను పదము యొక్క వివరమును చూస్తే ఇలా కలదు.

బ్రహ్మయనగా 'దేవుడు'యని అర్థము. రావణబ్రహ్మ యనగా **రావణుడే దేవుడుయని** చెప్పడము. దేవుడు భూమిమీద మనిషిగా పుట్టితే అతనిని భగవంతుడుయని అనాలి. దేవుడుయని అనకూడదు. 'భగవంతుడు' అను పదమును పేరు చివర చేర్చి చెప్పవచ్చును. ఉదాహరణకు చెప్పితే కృష్ణుని పేరు చివరిలో భగవాన్‌యని కలదు. **'కృష్ణ భగవాన్'** యనుట వలన **'కృష్ణుడు మనిషిగా వచ్చిన దేవుడని'** చెప్పవచ్చును. అలాగే దేవుడు మనిషిగా వస్తే ఆయనను భగవాన్‌యని పిలిచినా, ఆ పదము పేరు చివర ఉండవలెను అంతేగానీ బ్రహ్మయను పదమును అతని పేరు చివరిలో ఉండకూడదు. అయితే రావణుడు దేవుడే అయినా, ఆయన పేరు చివర భగవాన్ అని ఉండవలెనుగానీ బ్రహ్మయని ఉండకూడదు. అయినప్పటికీ రావణుని పేరు చివరిలో బ్రహ్మయని ఉండుటకు కొంత కారణము గలదు. అది ఏమనగా!

ప్రపంచములో ధర్మసంస్థాపన కొరకు దేవుడు మొట్టమొదట ఎప్పుడు అవతరించునో అప్పుడు అతను మొట్టమొదట మనిషిగా వచ్చిన

దేవుడని తెలియు నిమిత్తము మనిషిగా వచ్చిన వాని పేరు వెనుక బ్రహ్మయని చెప్పారు. దేవుడు మనిషిగా వస్తే ఆయనను ప్రత్యేకించి భగవంతుడు అనవలెనని, మొదట భూమిమీదికి వచ్చిన దేవునికి మాత్రము పేరు మొదట 'భగవాన్' అని ఉండునట్లు ఆనాటి దేవతలు, గ్రహములు, భూతములు అందరూ రావణునికి నమస్కరించడమేకాక **"భగవాన్ రావణబ్రహ్మ"** యని పిలిచారు. కొందరు 'రావణబ్రహ్మ' యనగా, మరికొందరు 'భగవాన్ రావణ బ్రహ్మ'యని అన్నారు. ఇదంతయూ చదివేవారికి క్రొత్తగా వింతగా యున్నా ఇది నూటికి నూరుపాళ్లు జరిగిన సత్యము. రావణుడు ప్రజలలో ఆనాడు, నేడు చెడు వ్యక్తిగా ప్రచారమయి ఉండగా, ఒక్కమారు అందరూ ఉలిక్కి పడులాగ **"రావణుడు దేవుడని"** చెప్పడము గొప్ప సాహసమే కాగా, ఆయన మొదట పుట్టిన దేవుని అవతారము అని గుర్తించునట్లు 'భగవాన్ రావణ బ్రహ్మ'యని చెప్పడము విచిత్రముగా ఉండును. అంతేకాక ఆయన ప్రజల మధ్యలో యున్నప్పుడు ఆనాడు లంకలో త్రికాల జ్ఞానియని పేరుగాంచి యున్నాడు. కాలము అనగా దేవుడుయని, పరమాత్మయని చెప్పవచ్చును. దేవుడు మూడు విధముల విభజింపబడియున్నాడు. పరమాత్మ, ఆత్మ, జీవాత్మగా యున్న దేవున్ని త్రికాలము యని అన్నారు. **'త్రికాలము' అనగా 'మూడు ఆత్మలని' తెలియవలెను.** మూడు ఆత్మలను తెలిసినవాడని రావణున్ని లంకలో ఆనాడే త్రికాల జ్ఞానియని అన్నారు. త్రికాల జ్ఞానియనగా జీవాత్మ, ఆత్మ, పరమాత్మయను మూడు ఆత్మలను తెలిసినవాడని అర్థము.

భగవద్గీతలో విశ్వరూపమను అధ్యాయమందు అర్జునుడు విశ్వరూపముగా యున్న దేవున్ని "నీవు ఎవడవు" అని ప్రశ్నించినప్పుడు

దానికి జవాబుగా **"నేను కాలమును"** అని 32వ శ్లోకమున **'కాలోస్మి'** యని అన్నాడు. ఆ మాట ప్రకారము దేవుడు కాలముగా యున్నాడనీ, విభజించి చూస్తే మూడు కాలములుగా యున్నాడనీ, మూడు కాలములనే మూడు ఆత్మలని అంటున్నామనీ, మూడు ఆత్మలను తెలిసియున్నవాడు రావణుడు అయినందున ఆయనను త్రికాల జ్ఞానియని అనడము జరిగినది. రాముని విషయము పూర్తి నాకు తెలియదుగానీ, రావణుని విషయము నాకు పూర్తిగా తెలియును. అందువలన రావణున్ని **'త్రికాల జ్ఞాని'** అనియు, ఆయనను **'బ్రహ్మ'** అనియు మరియు **'భగవాన్'** యనియు త్రేతాయుగము లోనే చెప్పబడినాడు. త్రికాలము అనగా! భూత, భవిష్యత్, వర్తమాన కాలములు అని కొందరు చెప్పుచూ రావణుడు భవిష్యత్తు, భూత కాలములను తెలిసినవాడని చెప్పుచుందురు. ఆ మాటకు వస్తే రావణుడు జ్యోతిష్య శాస్త్రమును తెలిసినవాడు, కావున ఆయనకు భవిష్యత్తు తెలుసు. భూతకాలము అనగా జరిగిపోయిన కాలములో ఎప్పుడు ఏమి జరిగినది పూర్తిగా జ్ఞాపకమున్న వాడు. ఇతరులకు జరిగిపోయిన కాలములో ప్రతీదీ జ్ఞాపకముండదు. అలాగే జరుగబోవు కాలము ఏమాత్రము తెలియదు. ఈ రెండు కాలములను రావణుడు బాగా తెలిసియున్న వాడు అయినందున ఆయనను పంచాంగమును బాగా తెలిసినవాడనీ, మంచి జ్యోతిష్యుడనీ చెప్పవచ్చును. అందువలన ఆ కాలములో రావణుడు జ్యోతిష్య శాస్త్రమును తెలిసిన పండితుడని చాలామంది చెప్పెడివారు. జ్యోతిష్యము తెలిసిన దానివలన త్రికాల జ్ఞాని అను పేరు రాలేదు. భూత, భవిష్యత్, వర్తమాన కాలములను తెలిసిన దానివలన ఆయనను జ్యోతిష్య పండితుడని అన్నారు. త్రికాల జ్ఞానికి భూత, భవిష్యత్, వర్తమాన కాలములకు సంబంధము లేదు. మూడు ఆత్మల విషయమును తెలిసిన దానివలన ఆయనకు త్రికాల

జ్ఞానియని పేరు కలదు. మూడు ఆత్మలను తెలిసినవాడు త్రేతాయుగములో రావణ బ్రహ్మ తప్ప ఎవరూ లేరు. అప్పటి కాలములో మొత్తము ప్రపంచములో మూడు ఆత్మలను తెలిసినవాడు ఒకే ఒక్కడు కలడు, ఆయనే రావణుడు.

'భగవాన్' అను పేరు రావణుని పేరు ముందు యుండుట వలన 'ఆయన మనిషి రూపములోయున్న దేవుడని' అనవచ్చును. అంతేకాక దేవుని రెండవ అవతారమునకు, ఆ తర్వాత వచ్చు అవతారములకు అన్నిటికీ పేరు చివరలో 'భగవాన్' అని ఉండడమైనది. ఆయన (రావణుడు) భగవాన్ యని ప్రజలకు తెలియక ముందే ప్రజలలో కొందరు జ్ఞానులు రావణుడు పరబ్రహ్మ స్వరూపమని, అనగా పరమాత్మ అయిన దేవుడని తెలిసి దేవునికి మారుపేరయిన 'బ్రహ్మ' అను పదమును రావణుడు అను పేరు చివరలో చెప్పుచూ 'రావణబ్రహ్మ' యనెడి వారు. మొదట రావణబ్రహ్మగా ప్రచారమయిన రావణుడు కొంతకాలము తర్వాత 'భగవాన్ రావణబ్రహ్మ'గా చెప్పబడినాడు. ఆయన దేవుని అవతారమని గ్రహించిన జ్ఞానులు భగవాన్ యని ఆయనను పిలువగా, కొంతమంది చెప్పిన 'భగవాన్ రావణబ్రహ్మ' అను పేరును అందరూ చెప్పక ముందునుండి చెప్పుచున్న రావణబ్రహ్మ అను పేరు నేటికీ పిలువబడుచున్నది. భూమిమీదికి మనిషిగా వచ్చిన వారిలో మొదటి భగవంతుడు రావణుడే అయిన దానివలన **"భగవాన్ రావణ బ్రహ్మ"** అయినాడు.

మొదట చెప్పబడిన 'బ్రహ్మ', తర్వాత కొంతకాలమునకు ఆయన చనిపోయిన తర్వాత చెప్పబడిన 'భగవాన్' రెండు పేర్లను జ్ఞాపకముంచుకొని రావణ అని ఎక్కడ పేరు వచ్చినా, ఆ పేరు ముందు 'భగవాన్' యనీ, పేరు చివర 'బ్రహ్మ' యను రెండు శబ్దములను అందరము పలుకుచూ

**"భగవాన్ రావణబ్రహ్మ"** యని ఇప్పటినుండి చెప్పుకొందాము. తాను దేవుడననీ రావణునికి జ్ఞాపకమున్నది. తన అవతారమును గురించి తాను తెలిసినా, తాను ఏ ఉద్దేశ్యముతో భూమిమీదికి వచ్చాడో ఆ ఉద్దేశ్యము నెరవేరునట్లు తన జీవిత కాలములో నడుచుకొన్నాడు. దేవుని అవతార ఉద్దేశ్యము "ధర్మసంస్థాపణ చేయడమే." అనగా భూమిమీద ఎవరికీ తెలియని దేవుని ధర్మములను బోధించడమే. భగవాన్ రావణబ్రహ్మ తర్వాత కృష్ణ భగవాన్‌గా, ఏసు భగవాన్‌గా ఆయనే వచ్చినా ఆ జన్మల అవతారములో కేవలము ధర్మములను బోధించాడుగానీ, అధర్మములను ఆచరించు వారిని శిక్షించలేదు. భగవాన్ రావణబ్రహ్మ కాలములో అధర్మములను ఆచరించు వారిని శిక్షించడము జరిగినది. **మొట్టమొదటి భగవంతునిగా వచ్చినవాడు భగవాన్ రావణబ్రహ్మ కాగా, ఆయన ద్వారా మొట్టమొదట జ్ఞానమును తెలిసిన శిష్యుడు జనకుడు.** జనకుడు రాజుగాయుండి, భగవాన్ రావణ బ్రహ్మవద్ద ధర్మములను తెలియగలిగి, ఎల్లప్పుడు ఆచరించబడు కర్మ యోగమును ఆచరించి మొట్టమొదట మోక్షమును పొందాడు. అందువలన **రావణబ్రహ్మయంత గురువు, జనకరాజుయంత శిష్యుడు లేదని** ఆనాడు చెప్పెడివారు.

**భూమిమీద అణగారిపోయిన ధర్మములను తెలియజేసిన మొదటి భగవంతుడు 'భగవాన్ రావణబ్రహ్మ' కాగా, భూమిమీద మొదట మోక్షము పొందినవాడు జనక మహారాజు.** అయితే ఈ విషయము కూడా నేడు ఎవరికీ తెలియదనే చెప్పవచ్చును. అంతేకాక రావణుడు భగవంతుడని కూడా తెలియదు. ఇప్పుడు నేను చెప్పు విషయములన్నియూ ఎప్పుడూ వినని, ఎవరూ చెప్పని క్రొత్త విషయములుగా ఉండును. జనక మహారాజు గురువు భగవాన్ రావణబ్రహ్మ అయినప్పుడు తన గురువును తన కూతురును పెళ్లాడమని స్వయంవరమునకు పిలిచాడనుట నూరుపాళ్లు అసత్యము.

అయినా విచక్షణలేని ప్రజలు సీత స్వయంవరమునకు అప్పటికే బ్రహ్మయని పిలువబడు రావణుడు వచ్చాడని నమ్ముచున్నారు. సీత స్వయంవరము సమయమునకు రావణబ్రహ్మ వయస్సు 85 సంవత్సరములు. జనకునికి గురువు అయినవాడు తన శిష్యుని కూతురుని పెళ్లాడవచ్చాడనుట అసత్యమగును. సీత వయస్సు (16) అయినందున రావణబ్రహ్మకు మనువరాలుయని చెప్పవచ్చును. తన తండ్రికి ఆధ్యాత్మిక గురువు రావణ బ్రహ్మయని తెలిసిన సీత, రావణబ్రహ్మ మీద భక్తి గౌరవములు కల్గియుండేది. అడవిలో సీత వనవాసమున రావణబ్రహ్మ కనిపించినప్పుడు ఆయన దర్శనము దొరికినందుకు సీత ఎంతో సంతోషపడినది. రావణబ్రహ్మ మీద ఎంతో భక్తి విశ్వాసములుగల సీత, రావణబ్రహ్మ తనవెంట రమ్మని చెప్పగానే సంతోషించి ఆయన వెంటపోయినది. అంతేగానీ రావణబ్రహ్మ బలవంతముగా సీతను తీసుకపోలేదు. సీత రావణబ్రహ్మగారి ఆధ్వర్యములో పది నెలల కాలమున్నా ఏనాడు ఏ లోటు లేకుండా జీవించగలిగినది.

**ప్రశ్న :- మీరు "ద్రావిడ బ్రాహ్మణ" యను గ్రంథములో రావణబ్రహ్మ బ్రాహ్మణుడు అని వ్రాశారు. నేడు చాలామంది దలితులు రావణుడు దలితుడనీ, తమవాడనీ అనుచుందురు. దీనికి మీరు ఏమి వివరణ ఇస్తారు.**

**జవాబు :-** నేను సత్యమునే చెప్పుతాను. అసత్యమును చెప్పను. ప్రతి మనిషి పుట్టినప్పుడు దిగువవాడుగానే పుట్టును. తర్వాత ఎగువవాడు కావచ్చును, కాకపోవచ్చును. 'దిగువవాడు, ఎగువవాడు' అంటే మీకు అర్థం కాకపోవచ్చును. అందువలన ఈ విషయమును కొంత సవివరముగా చెప్పెదను బాగా బుద్ధిని ఉపయోగించి విచక్షణ కల్గి వినవలెనని చెప్పు చున్నాను. పూర్వము అనగా ప్రపంచము పుట్టి అందులో మనుషులు పుట్టినప్పుడు మనుషులలో కులాలుగానీ, మతాలుగానీ లేవు. మానవ

జాతియంతా ఒకటిగా ఉండేది. అటువంటి సమయములో సూర్యుని ద్వారా భూమిమీద జ్ఞానము తెలియబడినది. మొదట 'మనువు' అను వ్యక్తికి దైవజ్ఞానము తెలియగా తర్వాత భూమండలమంతయు క్రమేపీ విస్తరించినది. ఆ విధముగా ప్రపంచ వ్యాప్తముగా జ్ఞానము వ్యాపించినా అందులో కొందరు మాత్రము జ్ఞానులుగా తయారు కాగా మిగతవారంతా అజ్ఞానులుగానే యుండిరి. అప్పుడు జ్ఞానులు, అజ్ఞానులు అని మనుషులలో రెండు తెగలు ఏర్పడినవి. ప్రప్రథమముగా మనుషులలో జ్ఞాన, అజ్ఞానయని రెండు గుంపులు ఏర్పడగా జ్ఞానము తెలిసినవారు ఎగువవారనీ, జ్ఞానము తెలియని వారు దిగువవారని చెప్పబడేవారు. జ్ఞానము తెలిసినవారు చాలా తక్కువ సంఖ్యలో వేలమందికి ఒకడు ఉండగా, మిగతా వారంతా అజ్ఞానులుగా యుండేవారు. వేయిమందికిగానీ, కొన్ని వేలమందికిగానీ ఒక జ్ఞాని యుండగా అతనిని అజ్ఞానులందరూ జ్ఞానము తెలిసినవాడని గౌరవించేవారు. అరుదుగా యున్న జ్ఞానులు ఎగువవారుగా యుండగా మిగతా జ్ఞానము లేని వారందరూ దిగువవారుగా ఉండేవారు.

ఎగువవారుగా ఉండే జ్ఞానులు అక్కడక్కడ యున్నా వారు మిగతా ప్రజలకు జ్ఞానమును బోధించువారిగా ఉండేవారు. జ్ఞానమును బోధించు వారు మిగతా ప్రజలకు గురువులుగా ఉండేవారు. గురువులుగా యున్న బోధకులను ప్రజలు గౌరవ భావముతో ఉన్నతమైన స్థానమును ఇచ్చి వారు క్రింద కూర్చొనెడివారు. జ్ఞానులయిన బోధకులు పైన కూర్చొని అజ్ఞానులయిన ప్రజలు క్రింద కూర్చోవడము వలన బోధకులు క్రింద కూర్చున్న ప్రజలను మా దిగువవారని చెప్పేవారు. సృష్ఠి ఆదిలో మొదట భూమిమీద జ్ఞానము తెలిసినప్పుడు ఈ విధముగా ఎగువవారు, దిగువ వారని రెండు తెగలు ఏర్పడగా! అందులో ఎగువవారు దిగువవారిని మా కంటే దిగువవారను భావముతో మా దిగువవారని చెప్పెడివారు. ఆ

విధముగా మా దిగువవారని జ్ఞానుల చేత చెప్పబడువారు ఎక్కువగా యుండేవారు. ఆనాడు మాదిగువవారను పేరు నేడు కొంత మార్పుచెంది యున్నది. 'మా దిగువవారను' పదము కాలక్రమమున 'మాదిగ వారు'గా మారిపోయినది. నేడు కూడా మాదిగవారు అనువారు మనుషులలో యున్నా వారిని ఒక కులముగా లెక్కించి చెప్పుచున్నారు. వాస్తవానికి మాదిగవారు (మా దిగువవారు) అనునది ఒక కులము కాదు. ఎగువవారు, దిగువ వారుయని మనుషులు రెండు తెగలుగా చెప్పబడిన తర్వాత కొంత కాలమునకు కులములు ఏర్పడినవి. కులములన్నీ దిగువవారయిన అజ్ఞానుల నుండే ఏర్పడినవి. ఎగువవారినుండి కులములు ఏర్పడలేదు. దిగువవారు అనేక కులములుగా చీలిపోగా, చాలా తక్కువగా యున్న ఎగువవారు తమది బ్రాహ్మణ కులము అని చెప్పుకొన్నారు. దానికి వివరణ ఇస్తూ బ్రహ్మజ్ఞానము తెలిసినవారు అందరూ "బ్రాహ్మణులము" అని అన్నారు. బ్రహ్మ అనగా దేవుడు. బ్రహ్మజ్ఞానము అనగా దైవజ్ఞానము అని అర్థము.

బ్రహ్మ జ్ఞానమును తెలిసినవారందరూ ఒక కులముగా ఏర్పడి మేము ఎగువవారమనుచూ మిగతా వారిని మా దిగువవారని చెప్పుచుండగా, దిగువవారయిన అజ్ఞానులు సమాజములో అనేక పనులను చేయుచూ వృత్తిరీత్యా కులము పేరును చెప్పుకొనుచూ పోయారు. కమ్మరి, కుమ్మరి, చాకలి, కమ్మ, కాపుయని ఎన్నో కులములు ఏర్పడినవి. ఎన్ని కులములుగా మనుషులు చీలిపోయినా వారు అందరూ జ్ఞానము తెలియనివారగుట వలన వారిని అందరినీ మా దిగువ తెగవారని చెప్పవచ్చును. **బ్రహ్మజ్ఞానము తెలిసిన వారు బ్రాహ్మణులు.** బ్రహ్మజ్ఞానము తెలియనివారు మా దిగువ వారని చెప్పుటకు అవకాశము గలదు. అయినా దిగువవారి నుండి ఎన్నో కులములు చీలిపోగా చివరకు కొందరు ఏ కులములోనికి పోనివారై మా

దిగువవారుగానే మిగిలియున్నారు. నేడు అనేక కులముల వారిగా యున్న వారందరూ 'మా దిగువ' అనబడు తెగకు చెందినవారే. కృతయుగములోనే కులములు తయారుకాగా, కలియుగములో మతములు కూడా తయారైనవి. కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగములో కులములు అనేకమున్నవి. కలియుగములో మాదిగువ వారినుండి మరికొన్ని కులములు పుట్టుకొచ్చినవి. త్రేతాయుగములోనే వాల్మీకి వలన బోయకులము ఉన్నట్లు, రామున్ని దూషించిన చాకలి వలన చాకలివారు త్రేతాయుగములోనే ఉన్నట్లు తెలియుచున్నది. ఏ యుగములో ఎన్ని కులములు వచ్చినా వాటికి మూల పుట్టుక మా దిగువ (మాదిగ) వారు అనే తెగనుండేయని తెలియ వలెను.

కలియుగములో మూడు వేల సంవత్సరములు గడచిన తర్వాత అనగా ఇప్పటికి రెండువేల సంవత్సరముల పూర్వము మహాజ్ఞాని అయిన ఏసు జన్మించాడు. ఆయన జ్ఞాని అయిన దానివలన ఆయన తనను తాను ఎగువవాడననీ, జ్ఞానము తెలియని అన్ని కులముల వారిని దిగువ వారని చెప్పాడు. ఈ విషయము బైబిలు గ్రంథములో యోహాన్ సువార్తలో 8వ అధ్యాయమున 23వ వచనమున ఇలా చెప్పారు చూడండి. **(యో, 8-23)** **"మీరు క్రిందివారు, నేను పైనుండువాడను, మీరు ఈ లోక సంబంధులు, నేను ఈ లోక సంబంధుడను కాను"** అని అన్నాడు. దీనినిబట్టి జ్ఞాని అయినవాడు ఎవడైనా ఎగువవాడేయని, జ్ఞానము తెలియని ఏ కులమువారయినా దిగువవారేయని స్పష్టముగా తెలియుచున్నది. నేను ఇంతవరకు చెప్పిన 'ఎగువవారు, దిగువవారు' అను సమాచారమునకు ఏసు చెప్పిన వాక్యము సాక్ష్యముగా యున్నది. ఎగువవారందరూ బ్రాహ్మణులుగా భారతదేశమునందు చెప్పబడుచున్నారు. బ్రాహ్మణయను పేరు ఇతర దేశములందు లేకపోయినా ఎగువవారను తెగయున్నదని కలియుగములోనే చెప్పిన ఏసుప్రభువు మాట సాక్ష్యముగా యున్నది.

నేడు భారతదేశమున బ్రాహ్మణ కులము యున్నది, తర్వాత మిగతా కులములు ఉన్నవి. మిగతా ఎన్ని కులములు యున్నా బ్రాహ్మణ కులమే గొప్పదిగా చెప్పుచున్నారు. జ్ఞానులయినవారు ఆనాడు గానీ, నేడుగానీ మిగతా కులములకంటే గొప్పవారుగా చెప్పబడుచూ బ్రాహ్మణులుగా యున్నారు. త్రేతాయుగములో రావణబ్రహ్మ మనిషిగానే పుట్టినప్పుడు చిన్నవయస్సులో జ్ఞానము లేనివాడుగా కనిపించినా, తర్వాత యుక్త వయస్సు నుండి జ్ఞానమును చెప్పుచున్నాడు కావున ఆయనను బ్రాహ్మణునిగానే చెప్పవచ్చును. కొంతకాలము జరిగిన తర్వాత దాదాపు 25 లేక 30 సంవత్సరములనుండి రావణబ్రహ్మ, జ్ఞానమును బోధించు బోధకుడైనందు వలన ఆయనను బ్రాహ్మణుడుయని చెప్పుచున్నాము. యుక్తవయస్సు రాక పూర్వము ఆయన దిగువ తెగకు చెందినవాడుగాయుండుట వలన ఆనాడు మా దిగువవారను పేరు కల్గిన వారందరూ 'రావణుడు మావాడు'యని అనెడివారు. అయితే నేడు కూడా రావణుడు మావాడు అనుటలో తప్పులేదు. ఒకప్పుడు కొంత వయస్సు వచ్చువరకు మాదిగువవాడుగా యున్న రావణుడు బ్రాహ్మణుడుగా ఇతరుల చేత చెప్పబడినాడను విషయము నేడు అజ్ఞానులుగా యున్నవారికి తెలియదు. కులముల వ్యవస్థ ఎలా ఏర్పడినది తెలియనివారు నేటికీ మా దిగువవారిగా మిగిలిపోయిన వారు రావణుడు మావాడు యని ఆనాడు, నేడు అంటూనే యున్నారు. దీనిని అంతటిని గమనించితే 30 సంవత్సరముల తర్వాత రావణుడు బ్రాహ్మణుడని చెప్పుచున్నాను. ఈ విషయము తెలియని దిగువవారు నేడు దలితులుగా చెప్పబడుచున్నా రావణబ్రహ్మ మావాడు అనుచున్నారు. వారు అలా అనడములో తప్పులేదు. నేను 'రావణుడు బ్రాహ్మణుడు' అనుటలో కూడా తప్పులేదు. 30 సంవత్సరముల వయస్సు వరకు ఒక జాతిగా (మాదిగ జాతిగా), 30 సంవత్సరముల తర్వాత బ్రాహ్మణుడుగా చెప్పబడుచున్నాడు. ఒక ఇంటి

కొడుకు కొంతకాలము తర్వాత  ఇంకొక ఇంటికి అల్లుడు అయ్యాడను కొనుము.  అప్పుడు అల్లుడు అని పిలువబడుతాడు.  అయితే పుట్టింటి వారు తమ వానిని కొడుకు అనడములో తప్పులేదు.  అత్తింటివారు అల్లుడు అనుటలో తప్పులేదు. అదే విధముగా పుట్టింటిలాంటి దిగువవారు రావణున్ని మావాడు అనుటలో తప్పులేదు.  అలాగే ఎగువవారు మా బ్రాహ్మణుడు అనుటలో తప్పులేదు.  అందువలన నేను 'రావణబ్రహ్మ బ్రాహ్మణుడు' అనుటలో తప్పులేదు.  దిగువవారయిన దలితులు 'రావణుడు మావాడు' అనుటలో కూడా తప్పులేదు.

**ప్రశ్న :- సురులు అనగా దేవతలనీ, అసురులనగా రాక్షసులని చాలామంది చెప్పుచుందురు.  రావణుడు అసుర జాతివాడనీ, రాక్షసుడనీ చెప్పుచుందురు. నీవు ఇప్పుడు బ్రాహ్మణుడు అనుట సరిపోవునా?**

**జవాబు :-** రావణుడు మొదట చిన్నవయస్సులో మాదిగువవాడయినా పెద్ద వయస్సు వచ్చు కొలది బ్రహ్మజ్ఞానము తెలిసి బ్రాహ్మణుడు అయ్యాడు. బ్రహ్మజ్ఞానము తెలిసినవాడు  శరీరమునకు అంతటికి ఆత్మ అధిపతియని తెలిసియుండును.  శరీరము ఆత్మ ఆధీనములో ఉండగా, శరీరములో జరుగు ఆత్మ పనులకు ఆటంకము కలుగకుండా చూచుకోవడం జ్ఞాని అయినవాడు చేయవలసిన పని.  ఆత్మ ఆహారమును వినియోగించుకొని, ఆహారములోని పోషక పదార్థముల ద్వారా శరీరమునకు శక్తినిచ్చి కదలించుట ఆత్మ పనిగా యున్నది.  అందువలన మనిషి అయినవాడు జ్ఞానమును తెలిసి ఆత్మకు అవసరమైన ఆహారమును భుజించును.  అంతేగానీ ఆహారము కానటువంటి మత్తు పదార్థములనుగానీ, మత్తుపాణీయములను గానీ ఆహారముగా స్వీకరింపడు.  ఒకవేళ స్వీకరించితే అది ఆత్మకు వినియోగపడు శక్తిగా కాకుండా, ఆత్మ పనులకు ఆటంకపరచు దానిగా ఉండును.  నేడు మత్తు పదార్థములు ఎన్నోయున్నా పూర్వము మత్తు

పదార్థములకంటే మత్తు పాణీయములే ఎక్కువగా ఉండేవి. ఆ కాలములో మత్తుపాణీయములను సురాపాణములు అనెడివారు. సుర అనగా మత్తుయని, పాణము అనగా త్రాగునది యని అర్థము గలదు. సురాపాణము చేయుట అనగా మత్తుపాణీయములను త్రాగుట యని అర్థము.

సుర అని మత్తు పాణీయమునకు పేరు పెట్టడములో ఒక అర్థము గలదు. **సు** అనగా మంచియనీ, **ర** అనగా రహితము (లేకుండా చేయునది) యని అర్థము. దానిప్రకారము **'సుర'** అనగా **'మంచిని లేకుండా చేయునది'** యని చెప్పవచ్చును. ఈ అర్థము ప్రకారము సురాపాణము చేసినవాడు అనగా మత్తుపాణీయమును త్రాగినవాడు మంచివాడయినా చెడువానిగా మారిపోవును. విచక్షణ లేనివాడై మంచిగా ప్రవర్తించక మత్తులో చెడు చేయుటకు మొదలుపెట్టును. అందువలన మత్తుపాణీయములు స్వీకరించిన వాడు మంచివాడైనా, మత్తులో చెడువానిగా మారిపోయి చెడుగా మాట్లాడడము, చెడుగా ప్రవర్తించడము చేయును. అంతేకాకుండా నోటి నుండి మాట తడబడుచూ వచ్చుచుండును. అలాగే మత్తు త్రాగినవాడు సరిగా నడువలేకపోవడము జరుగుచుండును. అందువలన శరీరములో జరుగు ఆత్మ చేయు పనులకు ఆటంకము కల్గించుట మత్తు యొక్క పని యగుట వలన మత్తుపాణీయమును స్వీకరించినవాడు ఆత్మకు ఆటంకము కలుగజేసినట్లేయగును. అందువలన మత్తు త్రాగువాడు ఆత్మకు ద్రోహము చేసినట్లగును. ఇవన్నిటినీ గ్రహించిన పెద్దలు మత్తును **సుర** అని అన్నారు. సుర అనగా మంచిని లేకుండా చేయునదని తెలుసుకొన్నాము.

పూర్వము మత్తుపాణీయములను త్రాగువారిని సురాపాణము చేయు వారని అనెడివారు. సురాపాణము చేయువారిని **సురులు** అని అనెడివారు. సురాపాణము చేయనివారిని అనగా మత్తు త్రాగనివారిని **అసురులు**యని అనెడివారు. అసురులు అనగా చెడును చేయనివారనీ, సురులు అనగా

మత్తులో చెడును చేయువారని, మంచి లేనివారని చెప్పవచ్చును. అసలయిన సత్యము ఇలా ఉండగా సురులు అనగా దేవతలు అనియు, అసురులు యని అనగా రాక్షసులని చెప్పడము పూర్తి తప్పుగా చెప్పినట్లుయగును. దేవతలు సురాపాణము చేయువారు అనియు, అసురులు అనగా సురా పాణము చేయనివారని అర్థము. అలాంటి దానిని రాక్షసులు చెడువారని, దేవతలు మంచివారని చెప్పడము విడ్డూరముగా యున్నది. వాస్తవముగా రావణబ్రహ్మ సురాపాణము చేయనివాడుగా ఉండెను. దానివలన రావణ బ్రహ్మకు మంచిపేరు ప్రజలలో ఇప్పటికీ యున్నది. ఎంతోమంది రావణ బ్రహ్మను చెడ్డవాడు అనినా, కొంతమంది అయినా ఆయనను మంచివాడని అభిమానించుచున్నారు. రావణుడు చెడ్డవాడను ప్రజల అభిప్రాయమును మార్చి మంచివాడని తెలుపు నిమిత్తము సురులు (దేవతలు) అనగా చెడ్డవారని, అసురులు అనగా చెడు లేనివారని తెలుపుచున్నాము.

**ప్రశ్న :- రావణుడు మాంసాహారి కదా! దేవతలు మాంసాహారులు కాదు కదా! మాంసాహారి కావున రావణున్ని రాక్షసుడు అని చెప్పవచ్చును కదా! మాంసాహారము వలన అతనిలో రాక్షస లక్షణములు ఉండవచ్చును కదా! మాంసాహారమును తినని వారిని దేవతలనీ, మాంసాహారము తినువారిని రాక్షసులనీ విభజించి చెప్పవచ్చును కదా!**

**జవాబు :-** సత్యము తెలియనంతవరకు ఎవరిని ఏమనుకొనినా ఫరవా లేదు. సత్యము తెలియనివారు మీరు ఏమనినా ఫరవాలేదు. సత్యము తెలిసిన మేము అలా చెప్పుటకు వీలులేదు. శాఖాహారము, మాంసాహారము అని రెండు రకములుగా ఆహారము విభజింపబడిన మాట సత్యమే. అయితే మనుషులకు ఏది శాఖాహారము, ఏది మాంసాహారము అని తెలియడము లేదు. మనము ఇప్పుడు వివరముగా చెప్పుకొంటే **"శాఖలు నుండి పుట్టినది లేక శాఖల నుండి వచ్చు దానిని శాఖాహారము"** అనవచ్చును. శాఖలు

అనగా కొమ్మలుయని అర్థము. చిన్నచెట్టు కొమ్మలు కావచ్చును, చెట్టునుండి లేక వృక్షము నుండి లభించు పండ్లుకానీ, దాన్యముకానీ కావచ్చును. దాన్యము మొదలుకొని చిన్నగింజల వరకు, అలాగే భూమిలోని దుంపలు మొదలుకొని వేరుచెనెగల వరకు అన్నీ శాఖాహారములే యని చెప్పవచ్చును.

మాంసము నుండి వచ్చు ఆహారమును మాంసాహారము అని చెప్పవచ్చును. జంతువులనుండిగానీ, పక్షులనుండిగానీ, జలచరములైన చేపలు, కప్పలు, తాబేళ్ల నుండిగానీ లభించు ఆహారమును ప్రత్యేకించి చెప్పడము ఏమనగా! జంతువులు చనిపోయినప్పుడు వాటి మాంసమును ఆహారముగా తినవచ్చును. అట్లే జంతువులు బ్రతికియున్నప్పుడు వాటి శరీరములో మాంసమునుండి తయారయిన పాలను మాంసాహారముగా చెప్పవచ్చును. చెట్లు శాఖలనుండి తయారయిన గింజలు, చెట్టునుండి కారిన నీరు, పాలను ఆహారముగా ఉపయోగించుకొనుచూ వాటిని శాఖాహారముగానే చెప్పుచున్నాము. అలాగే జంతువు నుండి తయారై బయటికి వచ్చు పాలు కూడా మాంసాహారముగా చెప్పవచ్చును. అయితే చాలామంది జంతువుల పాలను శాఖాహారముగా చెప్పడము పూర్తి తప్పు. జంతువుల పాలు చెట్టు శాఖల నుండి తయారై కారలేదు కావున అవి శాఖాహారమని చెప్పుటకు వీలులేదు. ఎవరికి తెలిసినా, తెలియకపోయినా పాలు మాంసాహారము అనుట సత్యము. చెట్టు శాఖల నుండి కారిన పాలను కొందరు 'చెట్టు కల్లు' అని అనుచుండిరి. చెట్టు పాలు ఏవయినా ఔషధ గుణము కల్గిన ఆహారముగా ఉండగా, జంతువుల నుండి కారిన పాలు కూడా ఔషధ గుణము గల ఆహారముగా యున్నవి.

ఆవు పాలను, గేదె పాలను మిగతా ఏ జంతువు పాలను అయినా మాంసాహారముగా చెప్పవచ్చును. అంతేకాక పాలనుండి తయారయిన జున్ను, వెన్న, పెరుగు, మజ్జిగ, నేయి మొదలయినవి ఏవయినా

మాంసాహారము గానే చెప్పవచ్చును. చెట్టు గింజల నుండి తయారయిన నూనెలను శాఖాహారముగా చెప్పవచ్చును. అదే విధముగా నూనెగా ఉపయోగపడు నెయ్యిని మాంసాహారముగా చెప్పవచ్చును. ఈ విధముగా యున్న శాఖాహారములను, మాంసాహారములను కలిపి మనిషి తినడము, త్రాగడము చేసి జీవించుచున్నాడు. కొందరు జంతు మాంసమును తినకుండా జంతువుల మాంసముతో తయారయి వచ్చిన పాలను త్రాగుచూ, పెరుగు, వెన్న, నెయ్యిని ఆహారముగా తీసుకొంటూ మేము శాఖాహారులము అని చెప్పడము కనపడు అసత్యముగాయున్నది. జంతువుల నుండి లభించు ఏదయినా మాంసాహారమే యగును. దీనినిబట్టి కొంత శాఖాహారమును, కొంత మాంసాహారమును మనిషి వాడుచున్నాడని చెప్పవచ్చును. అట్లే ఏ మనిషి శాఖాహారమునుగానీ, లేక మాంసాహారమునుగానీ, కేవలము ఒక దానినే వాడి బ్రతకడము లేదు. రెండు రకముల ఆహారములను కలిపి వాడుచున్నాడు. కొందరు ప్రత్యేకించి కొన్ని కులములుగా యున్నవారు మాంసమును తినకుండా ఉంటూ జీవితమును గడుపుచున్నారు. అంతమాత్రమున వారిని శాఖాహారులుయని అనకూడదు. పైకి శాఖాహారులని చెప్పు ప్రతి వ్యక్తి పాలను, పెరుగును, లేక నెయ్యిని వాడుచున్నాడు. అందువలన అతను పూర్తి శాఖాహారి కాదు, మాంసాహారి యని కూడా చెప్పవచ్చును.

అదే విధముగా ప్రతి వ్యక్తి మాంసాహారి మరియు శాఖాహారిగా యున్నాడు. వీరు రాక్షసులు, వీరు దేవతలుయని మనిషి ప్రవర్తనను, గుణములనుబట్టి చెప్పవచ్చును. మనిషిలోని గుణ ప్రవర్తననుబట్టి వీరు రాక్షసులు, వీరు దేవతలని చెప్పవచ్చునని ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో చెప్పియున్నారు. అంతేగానీ ఆహారమునుబట్టి వీరు రాక్షసులనీ, వీరు దేవతలనీ చెప్పలేదు. ప్రతి మనిషి పుట్టుకతోనే మాంసాహారిగా

జీవితమును ప్రారంభించుచున్నాడు. తర్వాత కొంతకాలము పెరిగిన పిమ్మట త్రాగే వయస్సు నుండి తినే వయస్సుకు వచ్చిన తర్వాత శాఖాహారమును తింటున్నాడు. మొదట శిశుదశలో తల్లిపాలను త్రాగడము వలన ప్రతి వ్యక్తి మాంసాహారియనే చెప్పవచ్చును. దీనిప్రకారము నేను శాఖాహారిని అని ఏ మనిషి చెప్పుటకు వీలులేదు. ఇప్పుడు రావణబ్రహ్మ కేవలము మాంసాహారియని చెప్పవచ్చునా? అట్లే మాంసమును తినని కొన్ని కులముల వారిని శాఖాహారులనవచ్చునా? ఎవరినీ ఒకే ఆహారమునకు సంబంధించిన వారుగా చెప్పలేము. ఆనాడు దేవతలని చెప్పబడినవారు మాంసాహారము, శాఖాహారము తీసుకొనెడివారు, అట్లే రాక్షసులనువారు మాంసాహారమును, శాఖాహారమును రెండింటిని తీసుకొనెడివారు. ఒక వ్యక్తి భోజనమును తినునప్పుడు మొదట అన్ని శాఖాహారములయిన పప్పు, చారు, సాంబారు అన్నీ తినినా, చివరిలో పెరుగుతో లేక మజ్జిగతో తినడము వలన అతను శాఖాహారియేకాక మాంసాహారియని కూడా చెప్పవచ్చును. రావణబ్రహ్మ ఆహారములో రెండు విధములయిన ఆహారములు ఉండేవి. రావణబ్రహ్మ నివసించు లంకచుట్టూ సముద్రము ఉండుట వలన ఆయన ఆహారములో ఎక్కువగా చేపలు, రొయ్యలు ఉండేవి. అంతేగానీ జంతుమాంసమును తినేవాడు కాదు. జంతుమాంసమును వాడనంతమాత్రమున ఆయన పాలు, పెరుగు వాడుటవలన, చేపలను తినుట వలన ఆయనను మాంసాహారిగా మరియు శాఖాహారియని చెప్పవచ్చును. ప్రతి మనిషి తల్లిపాలను త్రాగి మాంసాహారిగా జీవితమును ప్రారంభించి తర్వాత శాఖాహారిగా కూడా తయారై రెండు రకముల ఆహారములకు అలవాటుపడ్డాడు. అందువలన దేవతలు శాఖాహారులని, రాక్షసులు మాంసాహారులని విభజించి చెప్పుటకు వీలులేదు. దేవతలు, రాక్షసులు ద్వివిధ ఆహారములను సంయుక్తముగా తీసుకొంటున్నారు.

**ప్రశ్న :- రావణబ్రహ్మకు చిన్నప్పటినుండి పది తలలు ఉన్నాయనుట వాస్తవమా?**

**జవాబు :-** రావణబ్రహ్మకు చిన్నప్పుడు చదువు చెప్పిన గురువు రావణ బ్రహ్మను ఒక ప్రశ్న అడిగాడు. అప్పుడు రావణబ్రహ్మ దానికి జవాబు పది విధముల చెప్పాడు. అప్పుడు ఆయన చెప్పిన జవాబును చూచి ఆశ్చర్యపడి **"నీది కనిపించిన ఒక్క తలేకాక కనిపించని తలలు తొమ్మిది ఉన్నాయి."** అందువలన నేటి నుండి నిన్ను **'పది తలల రావణ'** అని పిలుస్తాను అని అన్నాడు. అప్పటినుండి రావణున్ని, విద్య నేర్పిన గురువు పది తలల రావణయని పిలిచెడివాడు. అప్పుడు ఆ మాటను విన్న చాలామంది విద్యార్థులు రావణున్ని ఎందుకు అలా పిలుస్తున్నారని గురువును అడిగారు. దానికి గురువు ఇలా చెప్పాడు. **"మీ అందరికీ ఒక తల తెలివేయున్నది. రావణునికి పది తలలకున్నంత తెలివియున్నది. అందువలన రావణున్ని పది తలలవాడాయని పిలుస్తున్నాను"** అని అన్నాడు. రావణబ్రహ్మ చిన్నప్పటి నుండే ఆయనకు పది శిరస్సులు కలవాడని పేరు వచ్చినది. అంతకూ రావణున్ని అతని గురువు ఏమి ప్రశ్న అడిగాడు, దానికి ఆయన ఏమి జవాబు చెప్పాడు అని చూస్తే ఇలా కలదు.

రావణ బ్రహ్మ గురువు **"నీకు ధైర్యమున్నదా?"** యని రావణున్ని ప్రశ్నించాడు. దానికి రావణబ్రహ్మ ఆధ్యాత్మికముతో కూడిన జవాబును చెప్పాడు. గురువుగారి ప్రశ్నకు, రావణుడు క్రింది విధముగా జవాబు చెప్పాడు చూడండి.

**1) మీషము ఉంటే రోషము ఉంటుంది.**

**2) రోషము ఉంటే పౌరుషము ఉంటుంది.**

**3) పౌరుషము ఉంటే పురుషత్వము ఉంటుంది.**

**4) పురుషత్వము ఉంటే త్రిపురత్వము ఉంటుంది.**

**5) త్రిపురత్వము ఉంటే ధైర్యము ఉంటుంది.**

**6) రోషము లేని మీషము పనికి రాదు.**

**7) పౌరుషము లేని రోషము పనికి రాదు.**

**8) పురుషత్వము లేని పౌరుషము పనికి రాదు.**

**9) త్రిపురత్వము లేని పురుషత్వము పనికి రాదు.**

**10) ధైర్యము లేని త్రిపురత్వము పనికి రాదు.**

ఈ జవాబును విన్న గురువుగారు ఆశ్చర్యపడి పోయాడు. ఒక్క ధైర్యమును గురించి అడిగితే ఆధ్యాత్మికముతో కూడిన పది వాక్యములను ఏకధాటిగా చెప్పిన రావణున్ని పొగడకుండా ఉండలేకపోయాడు. రావణునికి కనిపించే తల ఒక్కటేయున్నా, ఆ ఒక్క తలలో కనిపించని పది తలల తెలివియుండుట వలన రావణుడు దశ శిరస్సులవాడని చెప్పడమైనది. అప్పటికి రావణుని వయస్సు దాదాపు 18 సంవత్సరములుండవచ్చును. 18 సంవత్సరముల వయస్సునుండే రావణబ్రహ్మ "దశకంఠుడు"యని "దశ శిరస్సులు కలవాడని" పేరుగాంచాడు. రావణబ్రహ్మ ఏ విషయమునయిన పదింతల తెలివితో ఆలోచించుట వలన తప్పు నిర్ణయములు తీసుకోక ఎంతో సక్రమముగా సరియైన నిర్ణయములు తీసుకొనెడివాడు. అటువంటి రావణబ్రహ్మను అవమానముపాలు చేస్తూ, రావణుడు దుర్మార్గుడని ప్రచారము చేసిన ఆనాటి రచయితలు రావణబ్రహ్మకు తీరని అన్యాయము చేసినవారగుచున్నారు. దానితో విచక్షణ లేని ప్రజలు రావణున్ని ఒకవైపు దశకంఠుడనుచూ, మరొకవైపు దుర్మార్గుడు అనుచున్నారు. అలా ఆయనను ఆరోపించడము వలన, ఆయనది దేవుని అవతారమగుట చేత రావణ

బ్రహ్మను అవమానించిన వారికి ద్వితీయ దైవగ్రంథములో చెప్పినట్లు రెండు యుగముల పాపమును అనుభవించవలసి వచ్చును. అందువలన గ్రుడ్డిగా మాట్లాడుటకంటే విచక్షణ కల్గి మాట్లాడడము మంచిది. ఒక తల యున్నవాడు నా తెలివి గొప్పది అను భావములో ఉన్నాడు. దీనిప్రకారము పది తలల తెలివి యున్నవాడు ఎంతగొప్ప ఆలోచనవరుడైయుండునో తెలియగలదు. రావణబ్రహ్మ ఆధ్యాత్మిక గురువేకాక, దైవధర్మములను కాపాడి ప్రజల చేత ఆచరింపజేసినవాడు. దైవము మానవునిగా వచ్చిన అవతార మైనందున రావణబ్రహ్మను **'భగవాన్ రావణబ్రహ్మ'** యని పూర్వ కాలము చెప్పెడివారు. ప్రస్తుత కాలములో భగవాన్ యను పదము పోయినా రావణ పేరు చివర బ్రహ్మయని ఉన్నది. బ్రహ్మయనగా దేవుడుయనీ అర్థము. 'బ్రహ్మ' అను పదము సామాణ్య మానవులకు చెప్పబడదు. దానినిబట్టి అయినా రావణుడు దుర్మార్గుడు కాదని తెలియవలెను. మనుషులయిన వారు మంచివారిని చెడువారిగా, చెడువారిని మంచివారుగా చెప్పడము జరుగుచున్నది. మనము అందరివలె పోకుండా సత్యమునే చెప్పి, సత్యమునే ప్రచారము చేస్తూ, దానిలో భాగముగా రావణబ్రహ్మను **'భగవాన్ రావణబ్రహ్మ'**గా పిలుస్తాము.

**ప్రశ్న :- రావణబ్రహ్మ భగవాన్ రావణబ్రహ్మగా యుంటూ దైవ ధర్మములను ఏమని తెలియజేశాడు. దైవధర్మములను ఎలా కాపాడినాడు?**

**జవాబు :-** రావణబ్రహ్మ నేడు ప్రజల మధ్యలో ఆర్యులు చేసిన కుట్రల వలన దుర్మార్గుడుగా ప్రచారమయినా, వాస్తవముగా ఆయన ప్రజలు అనుకొన్నట్లు దుర్మార్గుడు కాడు. సాక్ష్యాత్తూ దేవుని అవతారమయిన 'భగవంతుని అవతారమని' నేడు తెలియగలిగాము. మొదట మోక్షము పొందిన జనకున్ని, కృష్ణుడు భగవద్గీతలో ఉదాహరణగా చెప్పాడు. ద్వాపరయుగములో జనకున్ని గురించి చెప్పాడంటే, ద్వాపర యుగము

చివరివరకు మోక్షము పొందినవాడు ఒక్క జనకుడు తప్ప ఇతరులు లేరనియే చెప్పవచ్చును. త్రేతాయుగములో జనకుడు మోక్షము పొందటానికి కారణము, ఆనాడు జ్ఞానము చెప్పిన రావణబ్రహ్మయేనని చెప్పవచ్చును. రామునివైపు వ్రాసిన రామాయణములో రావణుని విషయములను ఎన్నిటినో తెలియకుండా చేసిన దానివలన, వ్రాసిన సమాచారమును వక్రీకరించి వ్రాసిన దానివలన రావణబ్రహ్మ విషయము ఎవరికీ తెలియకుండా పోయినది. అందువలన రావణుడు లంకలో **"సామ్రాజ్య చక్రవర్తేకాక, ఆధ్యాత్మికవేత్తయనీ, దైవధర్మములను తెలియజేసిన గురువుయనీ, సాక్ష్యాత్తూ భగవంతుడను"** విషయము చాలామందికి తెలియదు. రావణబ్రహ్మ త్రేతాయుగములో జన్మించినవాడు. కృతయుగములో ప్రజలందరికీ జ్ఞానము తెలియబడినది. కృతయుగము చివరికల్లా ప్రజలలో ఉన్న జ్ఞానము లేకుండా పోవుటకు మొదలు పెట్టినది. **"ఎప్పుడు ధర్మములకు ముప్పు ఏర్పడి అధర్మములు ఆచరణలోనికి వచ్చునో అప్పుడు నేను అవతరిస్తానని"** భగవద్గీతలో చెప్పినట్లు దేవుడు మనిషిగా పుట్టవలసిన పని ఏర్పడినది. మనిషిగా పుట్టిన దేవుడు ఎవరో ఎవరికీ తెలియదు. ఎప్పుడు దేవుడు భగవంతునిగా పుట్టినా ఆయన ఫలానావాడు అని తెలియుటకు వీలు ఉండదు. అయితే ఎక్కడ ధర్మములు తెలియబడుచున్నవో అక్కడ భగవంతుడున్నట్లు గుర్తించవచ్చును. అయితే ఆయన చెప్పిన ధర్మములు అర్థమగుటకు ఎన్నో సంవత్సరములు పట్టును. మనిషి రూపములోయున్న భగవంతుడు చెప్పిన ధర్మములు ప్రచారమగుటకు కొన్ని పదుల సంవత్సరములు పట్టును. అవి ప్రచారమయిన తర్వాత అవి అర్థమగుటకు కొన్ని పదుల సంవత్సరములు పట్టును. అంతలో వచ్చిన భగవంతుడు జన్మను చాలించి పోయివుండును. అందువలన భగవంతుడు బ్రతికి యున్నప్పుడు ఆయనను ఎవరూ కనుగొనలేరు.

భగవంతున్ని ధర్మముల వలనకాక మరియొక విధానము చేత తెలియవచ్చును. **"ఎవరు ప్రకృతిని శాసించు శక్తి కల్గియుందురో"** వారు భగవంతుడని వెంటనే తెలియవచ్చును. అయినా దేవుని అవతారమును ప్రజలు గుర్తించలేనంత గ్రుడ్డివారుగా యున్నారు. ద్వాపర యుగములో కృష్ణుని విషయములో అదే జరిగినది. కలియుగములో ఏసు విషయములో అదే జరిగినది. కృష్ణున్ని, ఏసును ఏమాత్రము భగవంతునిగా ఇప్పటికీ ఒప్పుకోలేని వారున్నారు. అటువంటప్పుడు త్రేతాయుగములో యున్న రావణబ్రహ్మను దుర్మార్గునిగా చెప్పుచున్నారు గానీ, ఆయనను దేవుని అవతారమని గుర్తించలేకపోయారు. దేవుని అవతారమైన భగవంతుడు భూమిమీదికి వస్తే తన ధర్మములను తెలియజేయును. ద్వాపర, కలియుగములలో అదే జరుగగా, త్రేతాయుగములో రావణబ్రహ్మ ధర్మములను తెలియజేయడమేకాక, అధర్మములను ఆచరించు వారిని శిక్షించడము కూడా జరిగినది. త్రేతాయుగములో భారతదేశమునందు దక్షిణ భూభాగము కొంత జ్ఞానము కల్గియుండేది. అలా ఉండుటకు కారణము దక్షిణ భాగము శ్రీలంకకు ఆనుకొనియుండడమే యని చెప్పవచ్చును. శ్రీలంకలో రావణుడు ఉండుట వలన అక్కడ అధర్మ ఆచరణలు లేకుండా అందరూ ధర్మాచరణకు అలవాటు పడినారు. భారత దేశ దక్షిణప్రాంతములో కొంత ధర్మాచరణయున్నా కొంత అధర్మ ఆచరణ యుండేది. ఉత్తర భూభాగమున ఎక్కువగా అధర్మ ఆచరణయుండేది. శ్రీలంకకు దగ్గరగాయున్న దక్షిణ భారతదేశములో అక్కడక్కడ కొన్నిచోట్ల మాత్రము జరుగు అధర్మ ఆచరణలను రావణబ్రహ్మ తన సైన్యము చేత అడ్డుకొనెడివాడు. తన భూభాగము కాకున్నా తన రాజ్యమునకు ప్రక్కనే యున్న ప్రాంతమగుట వలన అక్కడ కూడా తనకు తెలిసి అధర్మములను

జరుగనిచ్చే వాడు కాడు. అధర్మములకు అలవాటుపడిన వారికి రావణబ్రహ్మ చర్యలు చెడుగా కనిపించేవి. అక్కడే రావణబ్రహ్మ దుర్మార్గుడుయని ప్రజలు చెప్పేదానికి మొదలుపెట్టారు.

అధర్మముల ఆచరణలను జరుగనివ్వక ఆపివేయడము వలన అధర్మములు మంచిగా కనిపించు వారందరికీ రావణబ్రహ్మ చెడుగా కనిపించే వాడు. దైవజ్ఞానము తెలియనప్పుడు ఏది ధర్మము, ఏది అధర్మము అని తెలియక అధర్మములను ధర్మములని అనుకొనెడివారు. అధర్మములనే భక్తి మార్గముగా తలచి ఆచరించేవారు. భగవద్గీతలో ఈ కార్యముల వలన దేవుడు తెలియబడడు అని చెప్పిన నాలుగు కార్యములను నాలుగు అధర్మములుగా చెప్పవచ్చును. భగవద్గీతలో భగవంతుడయిన కృష్ణుడు మూడు యోగములను తెలిపి వాటిని ధర్మములుగా చెప్పాడు. ధర్మముల వలన దేవుడు తెలియబడునని చెప్పాడు. దానినిబట్టి దేవుడు తెలియబడడని చెప్పిన నాల్గు కార్యములను అధర్మములుగా చెప్పుకోవచ్చును. **1) బ్రహ్మ యోగము, 2) కర్మయోగము, 3) భక్తియోగము** అను మూడు యోగములు దేవుని చేర్చు కార్యములు అయిన దానివలన వాటిని ధర్మములనీ చెప్పుచున్నాము. దీనిప్రకారము ధర్మములు మూడుయని చెప్పవచ్చును. అధర్మములు నాలుగుయని అవి 1) యజ్ఞము 2) వేదపఠనము 3) దానము 4) తపస్సుగా యున్నవని చెప్పవచ్చును.

కృతయుగము చివరినుండి మొదలయినవి నాలుగు అధర్మములు కాగా త్రేతాయుగము, ద్వాపరయుగము దాటి కలియుగములో ప్రవేశించగానే ఐదవ అధర్మము కూడా చేరిపోయినది. ఇప్పటికి భూమిమీద ఐదు అధర్మములు ఏర్పడినాయి. 'మతము' అనునది మనుషుల మధ్యలో ఏర్పడి అన్నిటికంటే పెద్ద అధర్మముగా తయారయినది. మిగతా నాలుగు అధర్మముల నుండి మనిషి తప్పించుకొనినా, 'మతము' అను ఐదవ అధర్మము

నుండి తప్పించుకోలేకపోతున్నాడు. కొన్ని ఇతర దేశములలో నాలుగు అధర్మములు లేకున్నా 'మతము' అను అధర్మము మాత్రము సంపూర్ణముగా యున్నది. త్రేతాయుగములో మతమను ఐదవ అధర్మము లేకున్నా భారత దేశములో మిగతా నాలుగు అధర్మములు సంపూర్ణముగా ఉండెను. అయితే శ్రీలంకలో ఏమాత్రము నాలుగు అధర్మములు లేకుండెను. భారతదేశ దక్షిణ భాగములో అధర్మములు ఉండడమేకాక అందులో యజ్ఞమును ఎక్కువగా ఆచరించేవారు. యజ్ఞము చేయుట అధర్మ ఆచరణ అగుట వలన రావణబ్రహ్మ తన పొరుగు దేశమైన భారతదేశపు దక్షిణ భాగములో జరుగు యజ్ఞములను భంగము చేయునట్లు తన అనుచరులకు ఆజ్ఞాపించుట వలన రావణబ్రహ్మ సైన్యములోని కొందరు వచ్చి యజ్ఞములను చెడగొట్టడమే కాక యజ్ఞములను చేయువారిని చితకబాది పోయెడివారు. రావణబ్రహ్మ తన విమానములో భారత భూభాగములో తిరుగుచూ పై నుండి గమనిస్తూ, ఎక్కడ యజ్ఞములు చేయునట్లు కనిపించినా, అక్కడ దిగి యజ్ఞములను భంగము చేసెడివారు. అలా చేయడము వలన యజ్ఞములు మంచి కార్యములు యని తలచి చేయువారందరూ రావణబ్రహ్మ దుర్మార్గుడనీ, తమ కార్యములను భంగము చేసిన దుర్మార్గుడుయని ప్రచారము చేశారు. ఇట్లు కొన్ని సంవత్సరములు రావణుడు బ్రతికియున్నంత కాలము భారత దేశములో కొంత భాగము వరకు తన విమానములో తన సహచరులతో సంచరించుచూ యజ్ఞములు చేయువారిని, తపస్సులు చేయువారిని, వేదములను చదువు వారిని దూషించి శిక్షించడము వలన ఆయనను భగవంతుడని గుర్తించ లేకపోవడమే కాక ప్రజలు ఆయనను దూషించేవారు.

**ప్రశ్న :- రావణున్ని భగవంతుడని చెప్పినవారిలో నీవే మొదటివానివి. రావణుడు త్రేతాయుగములో వస్తే అప్పటినుండి మూడు యుగములలో ఇంతవరకూ రావణున్ని దుర్మార్గుడన్న వారే యున్నారుగానీ, దేవుని**

**అవతారమనీ, భగవంతుడనీ ఇంతవరకు ఎవరూ చెప్పలేదు. శ్రీరాముడు త్రేతాయుగములో దేవుడని విన్నాము. ఇప్పటికీ ఆయనను శ్రీరాముడు దేవుడనే అందరూ అంటున్నారు. మీరు మాత్రము రామున్ని కాకుండా రావణుడు దేవుడని అంటున్నారు. ఇది లోక విరుద్ధము కాదా? కోదండ రాముడు దేవుడు కాడని, రావణుడు చెప్పినట్లు మీరు ఒక సందర్భములో అన్నారు. రావణుడు అయోధ్య రామున్ని దేవుడు కాడు అని ఎందుకు అన్నాడు? ఏ ఆధారముతో అన్నాడు?**

**జవాబు :-** మీరు అర్థము చేసుకోవడములో పొరపడినారు. రావణుడు చెప్పినది అయోధ్య రామున్ని 'దేవుడు కాడు' అన్నది వాస్తవమే! అంతేగానీ రామున్ని 'దేవుడు కాడు' యని ఎప్పుడూ రావణుడు అనలేదు. ఇక్కడ అందరూ పొరపడినది 'రాముడు ఒక్కడే ఆయనే అయోధ్య రాముడని' అనుకోవడము పూర్తి పొరపాటుయని చెప్పవచ్చును. వివరముగా చెప్పితే 'శ్రీరామ' అను పేరు కృతయుగము నుండి యున్నది. 'శ్రీరామ' అను పదము ఒక వ్యక్తి పేరు కాదు. దేవునికి మారు పదముగా 'శ్రీరామ' యని అనెడివారు. 'శ్రీరామ' అను పదములోనే దైవత్వము ఇమిడియున్నది. దైవత్వమున్న ఆ పదమును అనేకమంది కృతయుగములోనే పేరుగా పెట్టుకొనెడివారు. 'శ్రీరామ' యని పేరు పెట్టుకొన్న వారందరూ సాధారణ మనుషులే. కృతయుగము తర్వాత త్రేతాయుగములో దశరథ రాజుకు నలుగురు కొడుకులు పుట్టగా, అందులో పెద్దవానికి శ్రీరామ యను పేరును పెట్టారు. అప్పటికే త్రేతాయుగములో కూడా శ్రీరామ యను పేరుకల్గిన వారు అనేకమంది యుండుట వలన దశరథ పుత్రుడు వారికంటే అన్ని విధముల గొప్పవాడగుట వలన సామాన్య మనుషులలో రాజుకుమారునిగా పుట్టిన దశరథ పుత్రుని పేరు కలిసి పోకుండుటకు 'శ్రీరామ' అను పేరుకు

బదులు ఈయన ఫలానావాడు యన్నట్లు, ముఖ్యమైన మనిషి అన్నట్లు, సామాన్య మనిషి కాదు యన్నట్లు, ఆయన పేరు ముందర గుర్తింపు కలిగిన పదములను పెట్టడము మొదలు పెట్టారు. రామునికి చిన్నతనములో పెట్టిన పేరు ముందర ఈయన ఫలానావాడు అన్నట్లు మొదట 'దశరథ రామ' అని చెప్పారు. తర్వాత విలువిద్య నేర్చుకొన్నప్పుడు 'కోదండ రామ'యని అన్నారు. సీతను పెళ్ళాడిన తర్వాత 'సీతారామ' యని అన్నారు. తర్వాత పట్టాభిషేకములో దశరథునికి కైకకు వాదము జరిగి పట్టాభిషేకము లేకుండా పోయిన తర్వాత 'రామ' అను పదము ముందర 'పట్టాభి రామ' యని అన్నారు. రాముడు పుట్టినది అయోధ్యలో అగుట వలన ఆయనను 'అయోధ్య రామ' యని కూడా అన్నారు.

మొదట పెట్టినది శ్రీరామ అను పేరుకాగా అలా పిలిస్తే అందరితో సమానమై పోతాడని, సామాణ్యులలో సమానముగా కనిపించుట ఆయన తండ్రికి ఇష్టము లేక మొదట 'దశరథ రామ' యని పేరు పెట్టగా తర్వాత నాలుగు అటువంటి పేర్లే వేరువేరుగా పిలుచునట్లు ఏర్పడినవి. మొదట పెట్టిన 'శ్రీరామ' యను పేరు ఆయనకు చిన్నప్పుడే లేకుండాపోయి అతని హోదాను తెలుపుచున్న ఐదు పేర్లు రావడము వలన అందరూ ఐదులో ఎవరికి తోచిన పేరును వారు పిలిచెడివారు. ఆ విధముగా పిలువడము వలన మొదట పెట్టిన 'శ్రీరామ'యను పేరు ఎవరికీ అలవాటు లేకుండా పోయినది. దానివలన ఎవరూ శ్రీరామయని పేరుతో పిలువక మిగతా పేర్లతోనే పిలిచెడివారు. ఎవరయినా శ్రీరామ యను పేరుతో పిలిస్తే అలా పిలువకూడదని ఆయన సంబంధీకులందరూ చెప్పెడివారు. అలా చెప్పడము వలన ఆ పేరును అందరూ వదలివేసి 'అయోధ్య రామ'యను పేరు మొదలుకొని మిగతా నాలుగు పేర్లతో పిలిచెడివారు.

రావణుడు 'శ్రీరామ' అను పేరును గౌరవించేవాడు. 'శ్రీరామ' అను పదము దేవునికి సంబంధించినదని చెప్పెడివాడు. 'శ్రీరామ' అను మూడక్షరములు భక్తితో పలికితే పలికిన వానికి కొన్ని కర్మలు కాలిపోవును యని చెప్పెడివాడు. **శ్రీ** అనగా శుభకరమైన మోక్షము అనీ, **మ** అంటే నేను, **రా** అంటే నాశనము కావడము లేక లేకుండా పోవడమని అర్థము కలదు. **"నేను లేకుండా పోయి మోక్షము పొందుట"** యని అర్థము. 'శ్రీరామ' అను పదము పలుకడములో **జీవుడుగా యున్నవాడు (మ) లేకుండా పోయి (రా) మోక్షము పొందుట (శ్రీ).** దీనినిబట్టి జీవుడు లేకుండాపోయి దేవునిగా మారిపోవడముయని అర్థము. దేవునిలోనికి ఐక్యమైపోవడమును తెలుపు పదమే 'శ్రీరామ' అను పదము. అందువలన శ్రీరామ యని భక్తి పూర్వకముగా అన్నవారికి కొన్ని కర్మలు పోవును అని రావణబ్రహ్మయే చాలామందికి చెప్పాడు. ధశరథ రామున్ని రావణబ్రహ్మ దేవునిగా ఎప్పుడూ ఒప్పుకోలేదు. 'శ్రీరామ' అను పదము గొప్పదే, దైవ సూత్రము ఇమిడియున్నదే అయితే ఆ పేరు పెట్టుకొన్న వారందరూ సాధారణ మనుషులుగానే ఉంటారుగానీ, ఎవరూ ఆ పేరుకు తగినట్లు దేవుడు కాదు అన్నది రావణబ్రహ్మ వాదన. రావణ బ్రహ్మకు తెలిసిన విధానము ప్రకారము 'అయోద్య రామ' అనువాడు, 'దశరథ రామ' అనువాడు 'రామ' అను పేరు కలిగిన వ్యక్తేగానీ దేవుడు కాదుయనీ రావణబ్రహ్మ చెప్పేవాడు.

'శ్రీరామ' అను పదము దైవశక్తితో కూడుకొన్న శబ్దము. ఆ శబ్దమును మనుషులకు పేరుగా తగిలించినా, వారు మనుషులుగానే ఉందురు. ఎవడయితే 'శ్రీరామ' అను పదమునకు అర్థము తెలిసి, వాస్తవ భావముతో 'శ్రీరామ' యని పలికినంతమాత్రమున, పలికిన వానికి కొంత కర్మ పోవుట వాస్తవమేయని మనము కూడా ఒప్పుకోవలసిందే. వాస్తవముగా ఆ పదము **'మరాశ్రీ'** యని ఉండేది. దానిని పలుకడములో 'శ్రీరామ'యను

పదముగా ఏర్పడినది. మరాశ్రీ అనినా, శ్రీరామ అనినా రెండూ ఒకే అర్థమును ఇచ్చుచున్నవి. రావణబ్రహ్మ 'శ్రీరామ' అను పదమును దేవుడుగా ఒప్పుకొనే వాడుగానీ, పేరు పెట్టుకొన్నంతమాత్రమున 'మనిషి దేవుడు' అనుమాటను పూర్తి వ్యతిరేఖించెడివాడు. త్రేతాయుగము యొక్క వాస్తవ పేరు త్రైతాయుగము. అయితే అది త్రేతాయుగముగా మారిపోయినది. అట్లే 'శ్రీరామ' అనుమాట దైవత్వమును తెలుపునది. అయితే 1) దశరథ రామ, 2) అయోధ్య రామ 3) కోదండ రామ, 4) పట్టాభి రామ, 5) సీతా రామ, 6) కళ్యాణ రామ అను పేర్లు దైవత్వమునకు సంబంధించినవి కావుయని తెలుపుచూ, త్రైతా యుగములో (త్రేతాయుగములో) 'దేవుడు మనిషిగా పుట్టినది' వాస్తవమేగానీ, దశరథ పుత్రుడు దేవుడు కాదని రావణబ్రహ్మ చెప్పగా, అదే విషయమునే భక్త కబీరు కూడా "శ్రీరాముడు వేరుగాయున్నాడు. నేను దశరథ రామున్ని పిలువలేదు, తలువలేదు. నేను మాత్రము ఆత్మారాముడయిన శ్రీరామున్ని తలచుచున్నాను, అంతేగానీ అయోధ్య రామున్ని నేను తలువలేదని" భక్త కబీరు కూడా చెప్పాడు. దీనినిబట్టి రాముడు ఎవరో, రావణుడు ఎవరో తెలుసుకోండి.

**ప్రశ్న :- రావణుడు 'శ్రీలంక' అను దేశములో ఉన్నాడు. జనకుడు భారత దేశములో ఉన్నాడు. ప్రక్క దేశములో యున్న రావణుడు భారతదేశములో ఉన్న జనకునికి గురువువెట్లయ్యాడు? జనకుడు సముద్రమును దాటిపోలేడు కదా! దీనికి మీ జవాబు ఏమి?**

**జవాబు :-** రావణుడు పుట్టినది లంకలోనే. రావణుడు పుట్టక పూర్వము లంక కూడా భారతదేశమునకు సంబంధించిన దేశముగా చెప్పబడేది. లంకకు భారతదేశమునకు వేయి మీటర్ల దూరముకంటే ఎక్కువ ఉండేది కాదు. వేయి మీటర్లు అంటే ఒక కిలోమీటరు. వేయి మీటర్లు సముద్రమును

కొందరు ఈది దాటేవారు. కొంతమంది ఈదేదానికి దూరమగుట వలన సముద్రములో దిగేవారు కాదు. రావణ బ్రహ్మ పుట్టిన సమయములో **"దేవుడు భగవంతునిగా పుట్టాడని"** మేఘములు అను మహాభూతములు (జీవులు) సంతోషించినవారై ఎక్కువ వర్షమును కురిపించగా, భూమి సంతోషమును తెలియజేస్తూ కంపించగా, సముద్రములో సునామీ, భూమి మీద వరదలు ఏర్పడినాయి. ఆ సునామీ వలన భారత భూభాగము దాదాపు 20 కిలోమీటర్లు మునిగి పోయినది. అప్పటినుండి భారతదేశము వారు సముద్రమును దాటలేక లంకకు పోయేవారు కాదు. అప్పటినుండి లంకతో భారతదేశమునకు సంబంధము తెగిపోయినది. ఇదంతా రావణుడు పుట్టినప్పుడు జరిగినది. అంతవరకూ భారతదేశ పాలనలో భాగముగాయున్న లంక ప్రత్యేక దేశముగా ఏర్పడినది. 'లంక' అనగా 'చుట్టూ నీళ్లున్న కొంత ప్రాంతము' అని అర్థము. రావణ జన్మతో లంక ప్రత్యేక రాజ్యముగా ఏర్పడినది. భారతదేశముతో పరిపాలనా సంబంధము తెగిపోయి లంకకు ప్రత్యేకమైన రాజు, ప్రత్యేకమైన పాలన ఏర్పడినది.

రావణునికి 25 సంవత్సరముల వయస్సు రాగానే లంక పాలనా బాధ్యత రావణుని మీద పడినది. చిన్నవయస్సులోనే లంక రాజ్యమునకు రాజు అయిన రావణుడు తన దేశములో యున్న ప్రతి వ్యక్తి దైవజ్ఞానమును తెలియునట్లు, ఆరాధన చేస్తే ఒక్క ఈశ్వర లింగమునకే ఆరాధన చేయునట్లు తయారు చేశాడు. లంక దేశములో రావణుడు రాజు అయిన తర్వాత ప్రజలందరూ జ్ఞానులు కావడము, అందరూ ఈశ్వర లింగమునే పూజించడము వలన లంక ఒక ఆధ్యాత్మిక కేంద్రముగా తయారైనది. అంతవరకూ 'లంక' అను రెండు అక్షరముల పేరుకు మోక్షమునకు గుర్తు అయిన **'శ్రీ'** వచ్చి చేరినది. అందువలన అప్పటినుండి లంక శ్రీలంకగా మారిపోయినది. లంకను శ్రీలంకగా అందరూ పిలుచుటకు అలవాటు

పడిపోయారు. అప్పటినుండి నేటివరకు లంకదేశము శ్రీలంకగా పిలువ బడుచున్నది. ఆ కాలములో త్రేతాయుగము చివరివరకు రాత్రిపూట శ్రీలంక వైపు అనగా భారతదేశమునకు పూర్తి దక్షిణమున వెలుగు కనిపించేది. దూరమునుండి శ్రీలంకవైపు వున్న వెలుగును చూచిన భారతీయులు లంకలో ఏదో గొప్పశక్తి ఉందని అనుకొనెడివారు. అయితే ఆ గొప్ప శక్తి రావణుడే యని తెలియలేకపోయారు. దక్షిణ భారతదేశములో అందరికంటే మించిన జ్ఞానులు ఉండేవారు. గొప్ప జ్ఞానులయినవారు కొందరు రావణుడు సామాణ్యమైన మనిషి కాదనీ అతనిలో దైవజ్ఞానము, దైవము ఇమిడి యున్నదని తెలిసి 'రావణ' అను పేరు చివర 'బ్రహ్మ' యను బిరుదును అతికించి పూర్తిగా **"రావణబ్రహ్మ"**యని చెప్పారు. ఈ విధముగా లంక, శ్రీలంకగా, రావణుడు రావణబ్రహ్మగా మారిపోయాడు.

రావణబ్రహ్మకంటే దాదాపు ఇరువది ఐదు సంవత్సరముల చిన్నవాడైన జనకుడు శ్రీలంకవైపు రాత్రిపూట కనిపించే వెలుగును చూచి, రావణబ్రహ్మ గొప్ప ఆధ్యాత్మికవేత్తయని తెలిసి, ఏ విధముగా అయినా రావణ బ్రహ్మ శిష్యుడు కావాలని జనకుడు అనుకోవడము జరిగినది. అప్పటి కాలములోనే రావణబ్రహ్మకు **ఔషధ గుణములు మరియు మంత్రశక్తి తరంగములు కలిసియున్న విమానముండేది.** విమానము అనగా ఆకాశములో పయణించునదని అర్థము. అది ఎప్పుడూ భూమిమీద దిగకుండా ఆకాశములోనే ఉండేది. ప్రయాణించు సమయములోనే కాకుండా భూమి మీద దిగినా భూమికి అడుగు ఎత్తులో ఉండి నిలిచి యుండేది. ఆ విమానమును ఎక్కువగా పుష్పములతో అలంకరించబడేది. రావణబ్రహ్మ మీద గురుభక్తి కల్గిన శ్రీలంక ప్రజలు ఆయన ప్రయాణించే విమానమును పుష్పములతో అలంకరించేవారు. అందువలన దానిపేరు "పుష్పక విమానము" అని చెప్పబడేది. రావణబ్రహ్మ తనదేశమునకు సమీపమున యున్న భారతదేశములో దక్షిణ ప్రాంతమంతయూ తన

జ్ఞానమును తెలియజేశాడు. అప్పటి కాలములో రావణబ్రహ్మ జ్ఞానమును తెలిసి ఎందరో గొప్ప జ్ఞానులుగా మారారు. జనకుడు దక్షిణ భారతదేశములో ఒక ప్రాంత రాజుగా ఉండేవాడు. ఆయన రావణబ్రహ్మను గురువుగా కోరిన వారిలో మొదటివాడు. అందువలన రావణబ్రహ్మ తన విమానములో ఏ ప్రాంతమునకు వచ్చి జ్ఞానమును చెప్పితే ఆ ప్రాంతమునకు పోయి జ్ఞానమును తెలుసుకొనేవాడు. ఆ విధముగా రావణబ్రహ్మ జ్ఞానమును తెలియుట వలన జనకుడు గొప్ప కర్మయోగిగా మారిపోయాడు. కర్మ యోగమును ఆచరించి ఆ జన్మలోనే మోక్షము పొందినట్లు భగవద్గీతలో కర్మయోగమునందు ఇరవైవ (20) శ్లోకము సాక్ష్యముగా యున్నది.

భారతదేశము యొక్క ప్రక్క దేశమైన శ్రీలంక దైవజ్ఞానములో ప్రథమ స్థానమును ఆక్రమించియుండగా, ఉత్తర భారతదేశములోని ఆర్యులు రావణ బ్రహ్మమీద, శ్రీలంకమీద అసూయకల్గి రావణబ్రహ్మను అప్రదిష్టపాలు చేయవలెనని కంకణము కట్టుకొని అదే పనిగా రావణుడు చెడ్డవాడని, దుర్మార్గుడని ప్రచారము చేయను మొదలు పెట్టారు. సత్యాసత్యములను తెలియని ప్రజలు ఎవరు ఏమి చెప్పితే ఆ మాటను విచక్షణ లేకుండా వినడము వలన ఆర్యులు ప్రచారము చేసినట్లు రావణుడు రాక్షడుయనీ, కామాంధుడనీ, దుర్మార్గుడనీ నమ్మారు. ఆర్యులు అంతటితో ఆగక రావణ బ్రహ్మకు ఏమాత్రము సంబంధములేని ఉత్తరము దేశము వాడయిన దశరథ రామున్ని రావణునకు వ్యతిరేఖముగా ప్రచారము చేశారు. దానితో ప్రజలలో రాముడు మంచివాడు, దేవుడుయనీ, రావణుడు చెడ్డవాడు రాక్షసుడని ప్రచారమయిపోయినది. రావణబ్రహ్మ 'దేవుని అవతారమైన భగవంతుడై' యుండి, దైవజ్ఞానమునకే ఎక్కువ ప్రాధాన్యతనిచ్చి ప్రచారము చేసినా, ఎవరికీ ఏ చెడు చేయకున్నా చివరకు నేడు ప్రజల మధ్యలో రావణుడు చెడువానిగా, దుర్మార్గునిగా మిగిలిపోయాడు.

పేరు చివరిలో బ్రహ్మయని బిరుదుయున్నా, పేరు మొదటిలో 'భగవాన్' యను శబ్దమున్నా, ఆయనలోని దైవత్వమును గుర్తించని అజ్ఞానులు ఆయనను చెడువానిగా తలచినా, ఆనాడు ఆయన చెప్పిన జ్ఞానమును అనుసరించి నేటికీ భారతదేశములో ఆయన భక్తులు అక్కడక్కడ యున్నారు. రావణబ్రహ్మ దైవజ్ఞానమునే బోధించుట వలన లంక చుట్టుయున్న సముద్రమునకు 'జ్ఞాన సముద్రము' అని అర్థమొచ్చునట్లు 'ఇందూ మహా సముద్రము' అని పేరు పెట్టారు. 'ఇందూ' అనే పదము ఈ మధ్య కాలములో అనగా దాదాపు 150 సంవత్సరముల క్రిందట శబ్దము మార్పిడి జరిగి హిందూ మహా సముద్రముగా పేరు మారిపోయినది. 'ఇందూ' అను పదమునకు 'జ్ఞానము' అను అర్థము కలదుగానీ, 'హిందూ' అను పదమునకు ఏమాత్రము అర్థము లేదు అని గ్రహించవలెను. మేము పూర్వమున్న పేరును 'ఇందూ' అని చెప్పితే, చరిత్ర తెలియని వారు ఇదేదో ప్రత్యేకమయిన మతముగా భావించి, మమ్ములను కూడా అన్యమతస్థులుగా ప్రచారము చేయుచున్నారు. అంత గొప్ప రావణబ్రహ్మను దుర్మార్గుడు అన్నవారు మమ్ములను అన్యమతస్థులని ప్రచారము చేయడము పెద్ద వింతేమీ కాదు.

**ప్రశ్న :- లంక ప్రాంతములో రాత్రిపూట వెలుగు భారతదేశము వరకు కనిపించేదని చెప్పారు కదా! అలా ఎందుకు కనిపించేది? ఈ విషయములు రామాయణములో కూడా వ్రాయలేదు కదా! మీరు ఎలా చెప్పగలుగు చున్నారు?**

**జవాబు :-** ప్రపంచమంతా అణువణువునా వ్యాపించియున్నవాడు దేవుడు. దేవుడు శక్తి స్వరూపుడు, ఆయన అంతటా వ్యాపించియున్నా కనిపించే ఆకారము లేనివాడు. అందువలన ఆయనను ఎవరూ చూడలేరు. దేవుడున్నాడనుటకు ఏదయినా అందరికీ తెలియు సాక్ష్యముండాలి, కావున

అజ్ఞానులకు సహితము తెలియునట్లు, రావణబ్రహ్మ అవతారములో దేవుడు భగవంతునిగా ఉండగా, మొట్టమొదట వచ్చిన అవతారమయిన దానివలన ఆ విషయము అందరికీ గుర్తుండునట్లు లంకప్రాంతములో ఆకాశమందు కొంత వెలుగు కనిపించేది. రావణబ్రహ్మ నూరు సంవత్సరముల వయస్సులో చనిపోగా, అంతవరకు శ్రీలంక ప్రాంతములో ఆకాశమున కనిపించు వెలుగు ఇందూ (హిందూ) మహా సముద్రము మీదికి జరిగిపోయినది. **'రావణ జన్మ మొట్టమొదటి భగవంతుని జన్మ'** అగుట వలన ఆ విషయము ఎల్లప్పుడూ గుర్తుగాయుండునట్లు రావణబ్రహ్మ శక్తి ఆయన శరీరముతో ఉన్నంతవరకు వెలుగుగా కనిపించినది. ఆయన శరీరమును వదలి పోయిన తర్వాత అంతవరకు వెలుగుగా దృశ్యరూపములో యున్న శక్తి కార్యరూపము లోనికి మారిపోయి హిందూ మహా సముద్రము మీద లంకకు క్రింది భాగమున ఉండిపోయినది. ఆ కాలములో సముద్రము మీద ప్రయాణము చేయువారు లేరు. త్రేతాయుగము, ద్వాపరయుగము గడచిపోగా తర్వాత వచ్చిన కలియుగములో సముద్రయానము చేయు ఓడలు వచ్చినవి. భారతదేశము నకు శ్రీలంకకు మధ్య భాగములో సముద్రములో పెద్ద ఇసుక దిబ్బలు ఉండుట వలన తూర్పు ప్రాంతమునకు వచ్చు నౌకలు అన్నియు శ్రీలంకను చుట్టి రావలసిందే.

త్రేతాయుగము, ద్వాపరయుగము గడచిపోగా కలియుగము మొదటిలోనే క్రియ శక్తిరూపములో యున్న రావణబ్రహ్మ ఆత్మశక్తి ఉపరితల క్రియాశక్తిగా మారిపోయి అమెరికా ప్రక్కన ఐదువందల కిలోమీటర్ల దూరములో సముద్రమున త్రిభుజాకారములో నిలిచిపోయినది. అమెరికాలోని ఫ్లోరిడా రాష్ట్రము నుండి ఐదువందల కిలోమీటర్ల దూరములో తూర్పుప్రాంతమున బెర్ముడాదీవి సమీపములో నిలిచిన బ్రహ్మశక్తి క్రియాశీల శక్తిగా మారిపోయిన దానివలన తన గుర్తింపుగా ప్రజలకు అర్థముకాని

చర్యలు చేయుచున్నది. సముద్రములో రావణబ్రహ్మ జన్మకు గుర్తుగా నిలిచిన రావణబ్రహ్మ ఆత్మశక్తి మూడు ఆత్మల సిద్ధాంతము ప్రకారము మూడు కోణముల మధ్యలో నిలిచి యున్నది. సముద్ర ఉపరితలములో త్రిభుజా కారముగా యున్న శక్తి ఆ ప్రాంతము లోనికి పోయిన పెద్దపెద్ద నౌకలను, ఆకాశములో ఆ ప్రాంతము మీద పోవు విమానములను ఇప్పటికి వందలసంఖ్యలో కనిపించకుండా పోవునట్లు చేసినది. అది రావణబ్రహ్మ జన్మకు గుర్తింపుగా యున్న శక్తియని ఇంతవరకు ఎవరికీ తెలియదు. బెర్ముడా దీవి ప్రాంతములో త్రిభుజాకారముగా యున్న కనిపించని శక్తి వలననే ఎవరికీ అంతుబట్టని చర్యలు జరిగినవి.

రామాయణములో కేవలము రాముని ప్రక్కయున్న విషయములనే మంచిగా చూపుచూ వ్రాయడము జరిగినది. అందులో రావణబ్రహ్మ ప్రక్కగల ఒక్క విషయమును కూడా వ్రాయకపోగా రావణబ్రహ్మను చెడుగా చిత్రించి చూపారు. అంతేగానీ ఆనాడు లంకలో జరిగిన సమాచారముగానీ, సముద్రము మీద వెలుగునుకానీ ఏదీ వ్రాయలేదు. రామాయణములో కేవలము రాముని ప్రక్కన ఉన్న సమాచారమును మాత్రమే వ్రాశారు. అందువలన ఈనాడుగల బెర్ముడా ట్రయాంగిల్‌కు మూలాధారమైన ఆనాటి శక్తిని గురించి ఎవరికీ తెలియకుండా పోయినది. ఆనాడు లంక ప్రాంతము మీద ఆకాశములో రాత్రిపూట కనిపించే వెలుగును గురించి నేను చెప్పినా నేటి ప్రజలు నమ్మలేని అయోమయస్థితిలో పడిపోయారు. రామాయణములో లేని విషయమును మీరు ఎలా చెప్పగలుగుచున్నారని నన్ను ప్రశ్నించు చున్నారు. రామాయణములో రావణ విషయముండదనీ, అది కేవలము రామున్ని గురించి వ్రాసినదేయని వారికి తెలియదు. నేను వ్రాసిన గ్రంథములన్నీ ఎవరికీ తెలియని విషయములనే బోధించుచున్నవి. అందరికీ తెలిసిన విషయములను నేను చెప్పవలసిన పనిలేదు. ఎవరికీ తెలియని

అనేక రహస్యములు నా చేత చెప్పబడినవి. ఆ విషయములు ఎవరికీ తెలియనివని చెప్పుట సత్యమేగానీ ఆ విషయములు వాస్తవముగా నాకు కూడా తెలియవు. ఈ విధముగా అన్ని విషయములను వ్రాసిన నేను చెప్పడము కొందరికి విచిత్రముగానే ఉండును. ఎవరికి ఎట్లున్నా కొన్ని రహస్య విషయములు, చరిత్రలో జరిగిన కొన్ని సంఘటనలు నాకు తెలియని వేయని నేను ఒప్పుకుంటున్నాను. ఏమీ తెలియని వానివి ఎలా వ్రాశావు? అని కొందరు అడిగిన ప్రశ్నకు సమాధానముగా నేను ఇలా చెప్పుచున్నాను.

మనిషి శరీరములో జీవుడు, దేవుడు అను ఇద్దరు కలరు. జీవుడుగా నేను శరీరములో ఉండగా, నా శరీరములోని ఆత్మ దేవుడుగా చెప్పబడు చున్నది. జీవాత్మ, ఆత్మ రెండూ ప్రతి శరీరములోపల యుండగా పరమాత్మయను మూడవ ఆత్మ శరీరము లోపల, శరీరము బయట అంతటా అణువణువునా వ్యాపించి యున్నది. బయట కూడా వ్యాపించి యున్న పరమాత్మను దేవుడని చెప్పవచ్చును. దేవుడు అంటే అంతటా వ్యాపించి యున్నవాడే అయినా శరీరములోని ఆత్మను కూడా దేవుడనే చెప్పుచున్నారు. ఆధ్యాత్మిక విద్యలో పరమాత్మను మరియు ఆత్మను ఇద్దరినీ ఒకే పేరు అయిన 'దేవుడు' అనియే చెప్పుచున్నారు. శరీరములోని దేవుడయిన ఆత్మ కృతయుగమునుండి ఇప్పటి వరకు జీవుని వెంటనే ఉండును. జీవునికి ఏ జన్మ జ్ఞాపకము ఆ జన్మవరకే ఉండును. ఆత్మకయితే అన్ని జన్మముల జ్ఞాపకము ఉండును. అంతేకాక శరీరములో అధిపతిగా, అధికారిగా యున్న ఆత్మ సమస్త పనులను చేయుచూ, సమస్త మాటలను మాట్లాడుచున్నాడు. శరీరములో జీవుడు వాస్తవముగా ఏ పనినీ చేయలేదు. 'శరీరములో జరుగు అన్ని పనులను నేనే చేస్తున్నానని' జీవుడు అహము భావమును చేత అనుకొంటున్నాడు. అట్లే శరీరములో మాట్లాడు ప్రతి మాట శరీరములోని ఆత్మే మాట్లాడుచుండగా, జీవుడు ఊరకయున్న వాడైనప్పటికీ

అజ్ఞానము చేత, అహంకారము చేత నేనే మాట్లాడుచున్నానని అనుకొంటున్నాడు. ఈ విషయము మూడు దైవగ్రంథములయందు విపులముగా చెప్పబడినది. ఉదాహరణకు ద్వితీయ దైవగ్రంథములో మత్తయి 10-20 వాక్యములో **"నీవు మాట్లాడు ప్రతి మాట నీ తండ్రియైన ఆత్మయే మాట్లాడుచున్నాడు, నీవు ఏమీ మాట్లాడలేదు."** అని చెప్పియున్నారు. అట్లే ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో కూడా అనేకచోట్ల ఈ విషయమును చెప్పియున్నారు. ఈ వాక్యముల ప్రకారము ఎన్నో రహస్యములను నేను చెప్పలేదు. నా శరీరములోని ఆత్మయే చెప్పుచున్నది. ఈ విషయము నేను ఇంతకుముందు కూడా అనేకమార్లు చెప్పియున్నాను. దీనిప్రకారము ఈ గ్రంథములో చెప్పిన విషయములన్నియూ జీవుడనైన నేను చెప్పినవి కావు. రెండవ దేవుడుగాయున్న ఆత్మ చెప్పినవేయని తెలియవలెను.

**ప్రశ్న :- రావణబ్రహ్మ కొందరిచేత 'భగవాన్ రావణబ్రహ్మ'గా పిలువబడినా ఆయన రాముని బాణమునకు చనిపోయాడు. రాముని బాణము నాభిలో (బొడ్డులో) గ్రుచ్చుకోగా రావణబ్రహ్మ ప్రాణము పోయింది అని రామాయణములో వ్రాశారు. మీరు చెప్పే రావణాయణము ప్రకారము ఆ మాట సత్యమేనాయని మేము అడుగుచున్నాము? భగవంతుని జన్మ అంత సులభముగా చనిపోవడము కొంత విచిత్రముగా కనిపించుచున్నది. ఆనాడు జరిగిన సత్యమును తెలుపమని అడుగుచున్నాము?**

**జవాబు :-** రావణుడు భగవానుడేయని గతములో కొందరు గుర్తించి యుండవచ్చును గానీ, ఇప్పుడు రావణున్ని దుర్మార్గునిగా గుర్తించిన సమాజములో రావణుడు 'దేవుని అవతారమైన భగవంతుడని' చెప్పిన వారిలో మేమే మొదటివారము. దేవుడు ధర్మసంస్థాపనకు భూమిమీద

మనిషిగా పుట్టితే తాను సాధారణ మనిషిగానే ప్రవర్తించి, తనను సామాణ్య మనిషిగానే అందరూ గుర్తించునట్లు చేయును గానీ, తాను భగవంతుడనని ఎవరికీ తెలియనివ్వడు. ఆయన ఎలా జీవించినా ఆయన వచ్చిన ధ్యేయము నెరవేర్చిపోవును. భూమిమీద ఒక్కనికిగానీ, అనేకమందికిగానీ దైవ ధర్మములను తెలియజేసి పోవును. కృష్ణ అవతారములో అర్జునునికి ఒక్కనికే జ్ఞానము చెప్పగా, తర్వాత కలియుగములో వచ్చిన జన్మలో అనేకమందికి జ్ఞానమును తెలియజేశాడు. దేవుడు 'భగవంతుడు' అను మనిషిగా మూడు యుగములలో మూడుమార్లు వచ్చాడని ఆలస్యముగానయినా గ్రహించ గలిగాము. రావణబ్రహ్మ యొక్క జన్మ మొదటి భగవంతుని జన్మ అని తెలియగలిగాము. మొదటి జన్మలో ఎలా చనిపోతే అలాగే మూడు జన్మలలోనూ చనిపోయినట్లు ప్రజలకు తెలియాలని ఆయన నిర్ణయించుకొన్న నిర్ణయము. అలాగే రక్తము కారి మూడు జన్మలలోనూ చనిపోయినట్లు జరిగినది.

రావణబ్రహ్మకు ముందునుండి తెలిసినట్లే యుద్ధము జరిగినది. తాను అయోధ్య రాముని చేతిలో చనిపోవుదునని రావణుడు తన భార్యయైన మండోదరి దేవికి చెప్పాడు. రాముడు లంకకు వచ్చి యుద్ధము చేయుటకు కావలసిన వాతావరణమును అదేపనిగా సృష్టించాడు. ఆయన ముందే అనుకొన్నట్లు యుద్ధము జరిగినది. ఆ యద్ధములో రాముని బాణము రావణబ్రహ్మ నాభిలో తగిలి రావణబ్రహ్మ చనిపోవడము జరిగిన పనియే. అయితే కడుపులో అదియు నాభిస్థానములో ఏ ఆయుధము చేత పొడిచినా అక్కడ చనిపోవుటకు కారణమయిన అవయవములు లేకుండుట వలన ఎవరూ చనిపోరు. అయితే రామాయణములో వ్రాసిన దానిప్రకారము చూస్తే రావణబ్రహ్మ నాభిలో అమృతముతో నిండిన కలశము ఉన్నదనీ, అది యున్నంతవరకు రావణుడు చనిపోడుయనీ, రావణుని తమ్ముడయిన విభీషణుని ద్వారా రాముడు తెలుసుకొని, రాముడు తన బాణమును

నాభిస్థానములో గ్రుచ్చుకొనునట్లు చేయగా, రావణుడు తన కడుపులో నాభి భాగములో గ్రుచ్చుకొన్న బాణము చేత చనిపోయాడని చెప్పారు. అయితే ఇది కొంత నిజము, కొంత అబద్ధముగా యున్నది. రాముని బాణము రావణుని నాభిలో తగిలినది వాస్తవమేగానీ, రావణుని నాభిలో అమృత కలశము ఉన్నదనుట పూర్తి అసత్యము. వాస్తవముగా కడుపు స్థానములో ఎక్కడ ఏ ఆయుధము తగిలినా చనిపోవు ప్రమాదమేమీ ఉండదు. వాస్తవానికి మనిషి చనిపోవునంత ప్రమాదమును రాముని బాణము కలిగించలేదు. అయినా రావణబ్రహ్మ చనిపోవడము జరిగినది.

'నిందలేనిది బొందెపోదు' అను సామెత ప్రకారము ఏదో ఒక కారణము వలన మనిషి చనిపోవును. అదే విధముగా రావణబ్రహ్మ తాను ముందే నిర్ణయించుకొన్నట్లు చిన్న గాయమునకే చనిపోవడము జరిగినది. అంతేగానీ బొడ్డులో అమృతబాండమును కొట్టాడు అనుట అసత్యము. కృష్ణుని జన్మలో కూడా అపాయము లేనిచోట కాలివేలికి బాణము తగలగా ఆ కారణము చేత ఆయన మరణించడము జరిగినది. మూడు జన్మలలోనూ రక్తము కారి చనిపోవాలనునది నిర్ణయము. ఆ నిర్ణయము ప్రకారము ఒక జన్మలో కడుపులో బాణము తగలడము కారణము కాగా, రెండవ జన్మలో కాలివేలికి బాణము తగిలి చిన్న గాయమయినది. చిన్న గాయములో కొద్దిగా రక్తము కారిపోగా ఆ కారణము చేత కృష్ణుడు చనిపోవడము జరిగినది. అలాగే మూడవ జన్మలో చేతికి ములుకులు కొట్టగా కొద్ది రక్తపాతమునకే ఏసు చనిపోవడము జరిగినది. ఒకటి కడుపుకు, రెండు కాలికి, మూడు చేతికి తగిలిన రక్తగాయములతో చనిపోవడమైనది. వాస్తవానికి ఆ మూడు విధానములు రక్తము కారడము అనుట సత్యమే అయినా అది చనిపోవునంత ప్రమాదమును కల్గించు గాయములు కావు.

భగవంతునిగా పుట్టినవాడు మూడు విధములుగా చనిపోయినా మూడిటిలో రక్తము కారడము తప్ప ఏమీ లేదు. అలా మూడు జన్మలలో

ఒకే విధముగా చనిపోవడము వలన మూడు జన్మలకు ఒకదానితో ఒకటి అవినాభావసంబంధమున్నదనీ, ఆ సంబంధమునుబట్టి మూడు జన్మలు భగవంతునివేనని గుర్తించుటకు అవకాశమున్నది. చనిపోయిన విధానము ఒక్కటే, బోధించిన జ్ఞానము ఒక్కటే అయినదానివలన మూడు జన్మలు భగవంతునివేయని చెప్పుటకు పూర్తి ఆధారము దొరికినట్లయినది. రావణ బ్రహ్మ తన చావును తాను ముందే నిర్ణయించుకొని బయటికి ముందే చెప్పడము జరిగినది. ఆయన చెప్పిన మాటప్రకారము రావణుడు చనిపోయాడని చెప్పవచ్చునుగానీ, రాముని బాణము చేతనే చనిపోయాడని చెప్పుటకు వీలులేదు. రాముని బాణము కారణము కాగా ముందే తాను చెప్పినమాట నెరవేరింది. రావణబ్రహ్మ మరణము సాధారణ మనిషి చనిపోయినట్లు జరిగినా, ఆయన మరణము తర్వాత గొప్ప వెలుగు ఆయన శరీరమునుండి బయటికి వచ్చి ఇందూ మహా (హిందూ మహా) సముద్రములో నిలిచిపోయినది. తర్వాత కలియుగమున అమెరికాలో ఒక రాష్ట్రమయిన ఫ్లోరిడాకు తూర్పున 500 కిలోమీటర్ల దూరమున వచ్చియున్నదని, మా రచనలలోని **"త్రైతాకార రహస్యము"** అను గ్రంథమున వ్రాసియుంచాము. ఆ గ్రంథములో రావణబ్రహ్మ యొక్క గొప్పతనమును గురించి కూడా కొంతవరకు చెప్పడము జరిగినది. నేటికీ రావణబ్రహ్మకు గుర్తుగా అట్లాంటిక్ సముద్రము మీద ఎవరికీ అంతుబట్టని శక్తిగా ఏ పరిశోధకుని ప్రయోగములకు తెలియకుండా యున్నది. త్రైతాకారశక్తిగా సముద్రములో యున్నా నేటికీ ఆ శక్తిని గుర్తించలేనివారమై యున్నామని **"త్రైతాకార రహస్యము"** అను మా గ్రంథములో వ్రాయడము జరిగినది. రావణబ్రహ్మ పుట్టినది త్రైతాయుగములో అయితే ఆ యుగము పేరు నేడు కొద్ది మార్పుతో త్రేతాయుగముగా చెప్పబడుచున్నది. త్రైతాయుగమున పుట్టినవాడు రావణ బ్రహ్మ కనుక ఆయన గుర్తింపుగా త్రైతాకార శక్తి సముద్రము మీద నేటికీ కలదు.

**ప్రశ్న :- నేడు 'దలితులు' అను పేరున్నవారు రావణబ్రహ్మను గొప్పగా చూస్తున్నారు. 'మా దిగువవారు' అను పేరున్న వారినే దలితులుగా చెప్పుచున్నారు. మా దిగువవారు ఒక కులము కాదని మీరు చెప్పారు కదా! ఒక కులముకాని దిగువవారికి దలితులను పేరు ఎట్లు వచ్చినది? నేడు దలిత సంఘములు అనేకము గలవు. వారిని విచారించగా దలితులను మాటకు సరియైన జవాబు చెప్పక తమది ఒక కులముగా చెప్పు కొంటున్నారు. మా దిగువ కులమువారే దలితులని చాలామంది అంటున్నారు. వాస్తవముగా దలితులంటే ఎవరో? ఆ పేరు వారికి ఎలా వచ్చినదో మీరు సవివరముగా చెప్పగలరని అడుగుచున్నాము?**

**జవాబు :-** మీరు చెప్పినట్లు మా దిగువ వారినే దలితులని చెప్పడము జరుగుచున్నది. 'మా దిగువ' అనువారు ఒక కులము వారు కాదని, అజ్ఞానులుగా యున్న వారిని అందరినీ కలిపి చెప్పు పదమని ముందే చెప్పియున్నాము. ఇప్పుడు చెప్పు దలితులను వారుకూడా ఒక కులము వారు కాదు. అజ్ఞానములో యున్న అన్ని కులముల వారిని కలిపి చెప్పు పదము 'దలితులు' లేక 'మా దిగువవారు.' 'మా దిగువ' అనినా, 'దలిత' యని అనినా రెండూ అన్ని కులములలోని అజ్ఞానులను తెలుపు పదమేగానీ అది ప్రత్యేకించి ఒక కులము కాదు. సత్యమును చెప్పితే **'దలము'** అను పదమునుండి **'దలిత'** అను పదము ఏర్పడినది. దలము అనగా **అనేకులు ఒక గుంపుగా చేరి ఉండడమును దలము** అని అంటారు. ఆ దలములోని వారిని దలితులు అని అనవచ్చును. ఎక్కడయినా ఒక దలము తయారయితే ఆ దలములో ఒక జాతి, ఒక కులము అనువారు ఉండరు. అలాగే అజ్ఞాన దలములో ఒక కులము వారు లేకుండా అనేక కులముల వారుండడము సత్యము. అజ్ఞానము ఒక కులమునకు పరిమితి కాదు. ఏ కులములోనయినా అజ్ఞానులు ఉండవచ్చును. అలా అన్ని కులముల

అజ్ఞానులను కలిపి ఒక గుంపుగా చెప్పుచూ వారిని 'దలితులు' అని పూర్వము అనెడివారు. అలాగే అన్ని కులములలోని జ్ఞానులను కలిపి **'బ్రాహ్మణులు'** అని అనడమేకాక **'ద్విజులు'** అనెడివారు. అజ్ఞానులకు 'మా దిగువవారు' మరియు 'దలితులు' అని రెండు పేర్లతో చెప్పినట్లు, జ్ఞానమున్న వారిని కూడా 'బ్రాహ్మణులు' మరియు 'ద్విజులు' అని రెండు పేర్లతో పిలిచెడివారు. **దిగువవారు** అనినా, **దలితులు** అనినా అది ఒక కులముకాక **మొత్తము అజ్ఞానుల** గుర్తింపుగా ఉన్నది. అలాగే బ్రాహ్మణులు మరియు ద్విజులు అనినా అది ఒక కులమునకు సంబంధించిన పదముకాక **జ్ఞానులను** గుర్తింపు కలదిగా యున్నది. ద్విజులు అనగా రెండవమారు జన్మించిన వారని అర్థము.

పూర్వమున్న భావము పోయి ప్రజలలో క్రొత్త భావము వచ్చినది. దీనికి కారణము నేడు గత చరిత్ర తెలియని మనుషులు సమాజములో ఉండుట వలన, సత్యమును వదలి అసత్యమును ఆశ్రయించినవారై దలితులను, మా దిగువవారిని ఒక కులముగా చెప్పుచున్నారు. అలాగే బ్రాహ్మణులు, ద్విజులు అను వారిని కూడా ఒక కులముగా చెప్పుచున్నారు. వాస్తవానికి మా దిగువవారనినా, బ్రాహ్మణులనినా కులమునకు సంబంధము లేని పేర్లని. జ్ఞానమునకు, అజ్ఞానమునకు గుర్తింపుగా చెప్పిన పేర్లని తెలియవలెను. ఇప్పుడు మా దిగువ వారికి, దలితులకు వివరము తెలిసినది. అలాగే బ్రహ్మజ్ఞానము తెలిసినవారు బ్రాహ్మణులని కూడా అర్థము తెలిసినది. బ్రాహ్మణులను 'ద్విజులు' అనికూడా అనడము పూర్వముండెడిది. ప్రస్తుత కాలములో బ్రాహ్మణులయిన వారికి కొందరికి మాత్రమే 'ద్విజులు' అను పదము యొక్క అర్థము తెలుసు. నేడు కొంతమంది బ్రాహ్మణులకు 'ద్విజుడు' అను పదము యొక్క అర్థము తెలియదు. వారిని అడిగితే ద్విజులు అను పదమునకు సరియైన వివరణ ఇవ్వకున్నారు. ద్విజులు అంటే అజ్ఞానములో

చనిపోయి జ్ఞానములో పుట్టినవారని తెలియదు. నేడు ఇటు దిగువవారు, దలితులు అటు బ్రాహ్మణులు, ద్విజులు అను మాటకు అర్థము తెలియక రెండు వైపులవారు తమ పేర్లను ప్రత్యేక కులములనుకొనుచున్నారు. వాస్తవముగా గడచిన చరిత్ర తెలిస్తే వారు అలా అనుకొనేవారు కాదు. చరిత్ర మరచిపోయినవారై బ్రాహ్మణులు అగ్రకులమువారనీ, దలితులు తక్కువ కులము వారని చెప్పుకోడము జరుగుచున్నది. నేడు ఎక్కువ, తక్కువ కులముల పిచ్చి ముదిరిపోయినదై బ్రాహ్మణులు మాదిగువవారిని, అంటరాని వారని దూరముగా పెట్టుచున్నారు. అలా కులవివక్ష మనుషులలో మొదలైనది.

త్రేతాయుగములోనే మొదలయిన కులవివక్ష నేడు పెరిగి పెద్దదై దేశమంతా వ్యాపించినది. భారతదేశములో దక్షిణ దేశమున దలితులు ఎక్కువగా యున్నారనీ, ఉత్తర దేశములో బ్రాహ్మణులు ఎక్కువయున్నారనీ చెప్పుకొంటున్నారు. అంతేకాక దక్షిణ దేశమునయున్న వారిని ద్రావిడులనీ, ఉత్తరము దేశము వారిని ఆర్యులని చెప్పుకొనుచూ ఆర్యులను బ్రాహ్మణులు, ద్రావిడులను దలితులను అసూయతో వివక్షతో చూడడము అలవాటై పోయినది. ఇది ఈనాటి సమస్య కాదు. త్రేతాయుగములోనే పుట్టిన సమస్యయని తెలియవలెను. ఆర్యులయిన పండితులు రామున్ని గొప్పగా చెప్పడము రావణున్ని తక్కువగా, నీచునిగా చెప్పడము ఆనాడే జరిగినది. రాముడు వనవాసమున్నప్పుడు రావణుడు రామునికి తెలియకుండా సీతను తీసుకపోవడము వలన సీత జాడ తెలియక రాముడు నల్లమల అడవులలో సీతను వెతుకుచూపోగా అక్కడ గిరిజనులయిన వాలి, సుగ్రీవుడు కలువడము జరిగినది. వాలి, సుగ్రీవుల ద్వారా వారి సైన్యములోని హనుమంతుడు, జాంబవంతుడు కలియడము జరిగినది. అప్పుడు అన్నతమ్ములయిన వాలి సుగ్రీవుల మధ్యగల గొడవలలో రాముడు తలదూర్చి, వాలిని చంపి

సుగ్రీవునికి మంచి చేసినవాడై, తాము సీతను వెతుకుతున్నట్లు చెప్పారు. ముందుగానే వాలిని చంపితే సీతను వెతకడములో సాయము చేస్తానని చెప్పిన సుగ్రీవుడు హనుమంతున్ని సీతను వెతకమని రాముని పనియందు వినియోగించాడు. అప్పుడు రామునికి హనుమంతునికి పరిచయము ఏర్పడినది.

అడవిలో నివశించు గిరిజనులయిన జాంబవంతుడుగానీ, హనుమంతుడుగానీ, వాలి, సుగ్రీవులుగానీ కోతులరూపములో లేరు. వారు అందరూ మనుషుల జాతివారే. మన మాదిరి మానవ ఆకారమున్నవారే. ఆనాడు తమ రాజు అయిన సుగ్రీవుడు చెప్పినమాటకు కట్టుబడి హనుమంతుడు (ఆంజనేయుడు) సీతను వెతకి చివరకు లంకలో యున్నట్లు కనుగొన్నాడు. హనుమంతుడు ఒప్పుకొన్న మాటతప్పక సీతను వెతకడమే కాక రామునివైపు గిరిజనులైన వారందరూ పోయి, రావణబ్రహ్మ సైన్యముతో యుద్ధము చేసి, రామున్ని గెలిపించి సీతను తెచ్చుకొనునట్లు చేశారు. ఈ విధముగా ఎంతో మేలు చేసిన వారిని హీనముగా చూచి, మనుషులయిన వారిని కోతులుగా చిత్రించి, ఆర్యులు వ్రాయడము జరిగినది. ఆర్యులు ద్రావిడులను వివక్షతో చూడడమేకాక, చివరకు వారికంటే దక్షిణ దేశమున యున్నవారు తక్కువ వారను భావమును వ్యక్తము చేయుచూ జాంబవంతున్ని ఎలుగుబంటిగా, హనుమంతున్ని కోతిగా చిత్రించి చూపడములో ఆర్యులయిన వారు తమకు మేలు చేసిన వారిని సహితము నీచముగా చూపించగా, విచక్షణ లేని ప్రజలు మరియు ద్రావిడులు కూడా వారి మాటను నమ్మి మనుషులయిన వారిని కోతులుగానే లెక్కించుకొన్నారు. ఇది అన్యాయమని ఒక్కరు కూడా గ్రహించలేకపోయారు. హనుమంతుడు సీతను విడిపించడము వరకు పని చేశాడు. తర్వాత రామునితో ఎటువంటి సంబంధము లేదు. అయినా హనుమంతుడు రాముని భక్తుడైనట్లు చిత్రించి

రాముని పాదములవద్ద కూర్చుండునట్లు చూపించారు. అట్లు చూపించడము వలన ద్రావిడులు ఆర్యులకు సేవకులేయను భావమును కలుగజేశారు. హనుమంతుడు కోతికాదు, రాముని సేవకుడు కాదు, ఆయన పాదముల చెంత కూర్చోనూలేదు. హనుమంతుడు కోతియన్నది ఎంత నిజమో, రాముని భక్తుడు అన్నది కూడా అంతే నిజము. నేడు విద్యావేత్తలు, మేథావులు, విజ్ఞానవేత్తలు ఎందరో గలరు. మనుషులలాంటి కోతులు, మాట్లాడే కోతులు భూమిమీద ఎక్కడగానీ, ఏ కాలములోగానీ లేవని అందరికీ తెలుసు. అయినా మల్లన్న చెప్పితే పుల్లన్న విన్నాడు అన్నట్లు హనుమంతున్ని కోతియనీ, జాంబవంతున్ని ఎలుగుబంటి యని అన్నా అందరూ విని తలూపుచూ దానినే ఇతరులకు చెప్పుచున్నారు. గిరిజనుల సాయము పొందినదేకాక వారిని జంతువుల క్రింద జమకట్టి, భక్తులవలె కాళ్లవద్ద కూర్చోపెట్టడము సత్యమో, అసత్యమో మీరు ఒకమారు ఆలోచించండి. సత్యమును చెప్పు నన్ను తప్పుపట్టాలని చూడక బుద్ధితో యోచించి చూడండి. మా రచనలలోని **"ద్రావిడ బ్రహ్మణ"** అను గ్రంథములో హనుమంతుడు కోతియనుట పూర్తి అసత్యము అని చెప్పియున్నాము. అంతేకాక హనుమంతుడు ఏ విధముగా బలశాలి అయినది కూడా వ్రాశాము. హనుమంతుడు కోతియనుట ఎంత సత్యమో, రావణబ్రహ్మ దుర్మార్గుడు యని చెప్పడము కూడా అంతే సత్యమగును. భారతదేశములో ఆర్యులకు ద్రావిడులు లోకువగా పూర్వమునుండి యున్నట్లు గలదు. దానికి సాక్ష్యము రావణున్ని రాక్షసునిగా, హనుమంతున్ని కోతిగా, గిరిజనులను జంతువులుగా పోల్చి చెప్పడమేనని తెలియుచున్నది. త్రేతాయుగములో, ద్వాపరయుగములో దక్షిణ దేశమువారయిన ద్రావిడుల మీద మధ్య ఆసియా నుండి వలస వచ్చిన ఆర్యులు వివక్ష చూపుచునే యున్నారు. పూర్వమున్నంత వివక్ష నేడు లేకపోయినా, రూపాయిలో పావలావంతు నేడు కూడా ఉన్నది. పూర్తి

వివక్ష ఎప్పటికి లేకుండా పోతుందో యని ఎదురు చూడవలసిందే. ఇంతకాలానికి ధైర్యము చేసి సత్యము చెప్పిన నా మీద అసూయపడకుండా సత్యమును తెలియండని తెలుపుచున్నాను.

**ప్రశ్న :- నేటికాలములో దశరా పండుగకు, దీపావళి పండుగకు రావణ బొమ్మను పెట్టి దానికి పది తలలను పెట్టి పండుగ రోజు రావణ దహనము అను పేరుతో రావణ బొమ్మను దహించు సాంప్రదాయము దేశమంతా వ్యాపించియున్నది కదా! దేశము మొత్తము మీద ఇంతమంది తప్పు చేయుచున్నట్లేనా? దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** రావణ దహనము ముమ్మాటికీ తప్పు. అయినా అందరూ విచక్షణ లేకుండా చేయుచున్నారు. మొదట ఉత్తర దేశములో యున్న రావణ దహన సాంప్రదాయము నేడు దక్షిణ భారతదేశమునకు కూడా ప్రాకినది. ప్రతి ఒక్కరు రావణుడు ఒకే ఒక చెడ్డపని చేశాడని అదియే సీతను అపహరించుకపోవడమనీ, సీతను అనుభవించాలను దుర్బుద్ధే ఆయన చావుకు కారణమయినదని చెప్పుచున్నారు. రావణుడు సీతను తీసుక పోయినది వాస్తవమే అయినా ఏ సందర్భములో జరిగినది, ఏ ఉద్దేశ్యముతో జరిగినది అని ఏమాత్రము తెలియకుండానే మాట్లాడుచూ, రావణబ్రహ్మను చెడ్డవానిగా చెప్పుచున్నారు. ఆ చెడుతోనే ఆయన బొమ్మను దహించడము నేటికీ జరుగుచున్నది.

దేవుడు భూమిమీద మనిషిగా అవతరించి తన జ్ఞానమును చెప్పినా ఆయనలోని గొప్పతనమును ప్రజలు గ్రహించకపోగా జ్ఞానమును చెప్పు వాని మీదనే కక్షసాధింపు చర్యలకు మొదలు పెట్టుచున్నారు. దేవుని జ్ఞానము ముందర మదమెక్కినవారు వ్యతిరేఖముగా ప్రవర్తించుచూ, భగవంతునికి అనేక ఇబ్బందులు కలుగజేయుచున్నా, దుర్మార్గుల పనులు నెరవేరుచూ దేవుడయిన భగవంతుడు కూడా అవమానమును పొందుచున్నాడు.

దుర్మార్గులు అజ్ఞానులు అయినవారు ధన బలము, అధికార బలము కలిగి తాము చేయు పనులు అన్నియూ నెరవేరుచున్నవనుచూ జ్ఞానమునకు ఆటంకముగా ప్రవర్తించుచుండినా, భగవంతున్ని ఇబ్బంది పెట్టు పనులు చేయుచుండినా వారి పనులు నెరవేరడము, చివరకు భగవంతుడు ఏమీ చేయలేక వారి చేతిలో అవమానము పొందడము జరుగుచున్నది. అజ్ఞానులు ధన బలముతో, పదవీ బలముతో చేయు పనులకు ఏమాత్రము ఆటంకము కలుగకుండా దేవుడే అవమానమును పొందడము చూస్తే ఇందులో దేవుని చేతకాని తనము కనిపిస్తా ఉన్నది. భగవంతుడు అవమానము పాలు చెందేదేకాక ఆయన జ్ఞానము కూడా ప్రచారము కాకుండా పోవుటకు అవకాశము ఏర్పడుచున్నది. తన ధర్మములకు ముప్పుకల్గినప్పుడు అవతరించి వచ్చి ధర్మములు తెలియజేయడము దేవుని పనే అయినా, ఆయన ప్రచారము చేసిన జ్ఞానము అజ్ఞానుల చేత అణచి వేయబడుతూ యుంటే, అవతరించిన భగవంతుడు కూడా అవమానమును పొందుచూ యుంటే, దానిని దేవుని చేతకానితనము అనక ఏమనాలి? అణిగిపోయిన ధర్మములను తెలుపుటలో శ్రద్ధ వహించిన దేవుడు, అజ్ఞానుల చేతిలో భగవంతుడు అవమానము పొందునప్పుడు, ఆయన చెప్పిన జ్ఞానము కూడా అవమానము పొందినట్లు కాదా?

ఏనాడో త్రేతాయుగములో దేవుడు భగవంతునిగా పుట్టి తన ధర్మములను ప్రచారము చేస్తే, ఆయన బ్రతికియున్నప్పుడే ఆయన జ్ఞానమును చూడకుండా, ఆయనను దుర్మార్గునిగా చెప్పిన ప్రజలు ఆయన చిత్రపటమును గానీ, ఆయన బొమ్మనుగానీ ఆనాటినుండి నేటి వరకూ మూడు యుగములు గడచినా వదలకుండా 'రావణ దహనము' అను పేరుతో అవమానిస్తు యుంటే, ఆ పనిని దేవుడు నివారించలేదు అంటే, ఆయన కొన్ని పనులు మాత్రము చేయగలడు, గొప్పవాడని చెప్పుకోగలడు. మిగతా అన్ని పనులు

చేయలేదనీ, చేయలేకనే యుగముల పర్యంతము తన అవతార బొమ్మను అదే పేరుతో కాలుస్తుంటే ఇది చెడుయని తెలుపలేకపోయాడు. ఇంతకాలము వరకు నివారించలేకపోయాడు. దీనినిబట్టి సన్మార్గులను భయపెట్టే దానికి దేవుడే గానీ, దుర్మార్గులను ఎదురించుటకు చేతకానివాడే యని తెలియు చున్నది. సత్యమునే చెప్పితే ధనబలము, అధికార బలముయున్న వాని పనులు నెరవేరడము, భగవంతుడు లేక జ్ఞానులు జ్ఞాన సంబంధముగా చేయు పనులు నెరవేరకపోవడము చూస్తే మరియు దుర్మార్గులను దేవుడు ఏమీ చేయలేనప్పుడు దుర్మార్గుల ముందర ఓడిపోయినట్లు కాదా! జ్ఞానమే గొప్ప, దేవుడే గొప్పయని నమ్మిన మాలాంటివారు చేయు పనులు నెరవేరక జ్ఞానమునకు ఆటంకము చేయు అజ్ఞానుల పనులు నెరవేరడము, వారు ఆరోగ్యవంతులుగా ఉండడము చూస్తే దేవుడు కూడా చేయలేనివి చాలా ఉన్నాయని తెలియుచున్నది. జ్ఞానికి ఆరోగ్యము బాగా లేకుండాపోయి అజ్ఞానికి, దుర్మార్గునికి మంచి ఆరోగ్యమున్నప్పుడు, అన్ని సుఖములు అతడు పొందుచున్నప్పుడు అజ్ఞానిని దేవుడు ఏమీ చేయలేకపోవుచున్నాడని తెలియుచున్నది. అందువలన నా అనుభవములో రావణబ్రహ్మను, మరి కొంతమందిని చూచిన తర్వాత దేవుడు అన్నీ చూస్తాడులే అనుకోవడము పెద్ద పొరపాటు. అందువలన ఆధ్యాత్మికమును నేర్వవచ్చును గానీ, అన్నింటికీ దేవుడే అనుకోవడము పొరపాటే యగుచున్నదని చెప్పవచ్చును. దానికి రావణ బ్రహ్మకు జరుగుచున్న అన్యాయమును చూచిన తర్వాత మాలాంటి వారికి దేవుడే దిక్కు అనుకోవడము పొరపాటేయగునని తెలియుచున్నది. **తస్మాత్ జాగ్రత్త.**



**అసత్యమును వేయిమంది చెప్పినా, అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా, అది అసత్యము కాదు.**